# సంతానహీనతతో బాధపడేవారికి ఆధునిక వైద్యం ఒక వరం



**తెలుగు రాష్ట్రాల్లో ప్రఖ్యాత సంతాన వైద్యనిపుణురాలు డాక్టర్ యారాశి పద్మలత**

**పిల్లల్లేకుండా అలమటిస్తున్న వేలాది మంది వివాహితుల జీవితాల్లో చిన్నారుల బోసినవ్వుల్ని పండిస్తున్న సక్సెస్‌ఫుల్ డాక్టర్**

**ప్రశ్న: డాక్టరు గారు మాకు వివాహమై ఒకటిన్నర సంవత్సరమైనా మాకు యింతవరకు పిల్లలు కలగలేదు. కారణం ఏమైవుంటుందో చెప్పగలరా? (క్రిష్ణమూర్తి, పీలేరు)**

**జవాబు:** పిల్లలు కలగకపోవడానికి ఈరోజుల్లో చాలా కారణాలు వుంటాయి. అయితే ఒక్కో కారణాన్ని నిశితంగా పరిశీలించినట్లయితే ఖచ్చితంగా సమస్య ఏమిటో తెలుసుకోవచ్చు. గతంలో కారణాలేమిటో ఇదమిద్ధంగా చెప్పేవాళ్ళు. కానీ ఈ రోజుల్లో సమస్య ఎలాంటిదైనా వెంటనే తెలుసుకునే అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులోకి వచ్చింది. దీనిద్వారా కారణాలు తెలుసుకోవడంతోబాటు పరిష్కారమార్గాన్ని కూడా తెలుసుకుని సంతానవంతులయ్యేలా చెయ్యవచ్చు. సంతానం కలగకపోవడం అనేది మీ ఒక్క సమస్యకాదు. లోకంలో ప్రతి ఆరు జంటల్లో ఒకరు ఇలాంటి సమస్యతో వున్న వారి సంఖ్య మరింతగా పెరిగింది. మనం తీసుకునే ఆహారంలో మార్పులు వచ్చియి అలాగే వాహనాలు, కిచెన్‌లో వస్తువులు అందుబాటులోకి వచ్చాక శారీరక వ్యాయామం పూర్తిగా తగ్గిపోయింది. గతంలో 18 సంవత్సరాలకే వివాహాలయ్యేవి. ఇపుడు జీవితంలో సెటిల్ అయ్యాకగానీ పెళ్ళిళ్ల చేసుకోవడం లేదు. అంటే లేటు వయసులో వివాహాలు కూడా కారణంగా చెప్పవచ్చు. తీసుకునే ఆహారంలో సమతుల్యత లోపించడం, అధిక బరువుతో హార్మోన్ల ఉత్పత్తిలో అసాధారణ పరిస్థితులు చోటు చేసుకోవడం యిలా అనేక కారణాల వల్ల పిల్లలు కలగడం లేదని చెప్పవచ్చు.

**ప్రశ్న: పద్మలత గారు మాకు ఆరు నెలల క్రితం పెళ్ళయింది. గర్భం రాలేదు. అంటే నాకు పిల్లలు పుట్టడంలో సమస్య వున్నట్లా? లేనట్లా? (వేదవతి, రాజంపేట)**

**జవాబు:** పెళ్ళయ్యాక మొగుడూ పెళ్ళాలు సంవత్సరంపాటు దాంపత్య జీవితం గడిపిన తరువాత కూడా గర్భం రాలేదంటే పిల్లలు కలగడంలో ఏదో అనారోగ్యం వున్నట్లుగా గుర్తించాలి. అదికూడా నీ ఒక్కదాని సమస్యగానో భావించక్కర్లేదు. మీ వారిలో లోపం కూడా వుండవచ్చు. సాధారణంగా పెళ్ళయిన సంవత్సరంలోనే 80 శాతానికి పైగా మహిళలు పిల్లల్ని కంటుంటారు. లేదంటే ఆరేడు శాతం మంది రెండో సంవత్సరంలోనైనా పిల్లల్ని కంటుంటారు. అయితే పెళ్ళయ్యి సంవత్సరం దాటిన వెంటనే పిల్లల వైద్యనిపుణులను కలవడం మంచిది. ఎందుకంటే పిల్లల వైద్యనిపుణులను కలవడం మంచిది. ఎందుకంటే లోపం వున్నట్లుగా భావించాలి కాబట్టి. ఆడవాళ్ళ వయసు ఎక్కువగా వున్నా, ప్రతినెల్లా పిరియడ్స్ సరిగా రాకున్నా, వేరే ఏవన్నా సమస్యలు వున్నట్లయితే ముందుగా కూడా సంతాన వైద్యనిపుణులను కలవచ్చు.

**ప్రశ్న: మేడమ్ మాకు వివాహమై రెండు సంవత్సరాలు దాటింది. అయినా పిల్లల్లేరు. ఈ మధ్యన మాకు తెలిసిన డాక్టరు వద్దకు వెళ్ళి చూపించుకున్నాము. మాకు పిల్లలు పుట్టడంలో ఏదో లోపం వుందని మా డాక్టరు చెప్పారు. ఏం చెయ్యాలో చెబుతారా? (సుకన్య, వెల్దుర్తి-కర్నూలు)**

**జవాబు:** పిల్లలు పుట్టడంలో ఏదో ఇబ్బంది వున్నట్లుగా మీ డాక్టరు గారు చెప్పారంటే మీరు గానీ, మీ భర్తగానీ ఏదో అనారోగ్యంతో వున్నట్లుగా మీరు గుర్తించాలి. ఇపుడు కారణాలేమిటో తెలుసుకుని వాటిని పరిష్కరించుకుంటే మీరు తల్లిదండ్రులవుతారు. ముందుగా మీరు మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్‌కు రండి. భార్యాభర్తలిద్దరికి మేము కొన్ని పరీక్షలు చెయ్యాల్సివుంటుంది. పరీక్షలో శుక్రకణాలు సంఖ్య తక్కువగా వుందని గుర్తిస్తే మరికొన్ని హార్మోన్ పరీక్షలు, జన్యుపరీక్షలు చెయ్యాల్సి వుంటుంది. ఆడవాళ్ళలో ప్రాథమికంగా హార్మోన్ పరీక్షలు, అండాలు సరిగా విడుదలవుతున్నాయా లేదా తెసుకోవడానకి ఆల్ట్రాసౌండ్ స్కానింగ్ పరీక్షలు, ట్యూబులు ఎల్లా వున్నాయో తెలుసుకోవడానకి ఎక్స్-రే లేదా ల్యాప్రోస్కోపి చేయిస్తాం. వీటి ద్వారా వచ్చే ఫలితాలను సమగ్రంగా అధ్యయనం చేస్తాం. దాన్నిబట్టి చికిత్స ఏం చెయ్యాలో నిర్ణయిస్తాం.

ADVT



## మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్

### తిరుపతి

మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
మా భూమి టవర్స్, డోర్ నెం:18-1-302ఎ/ఎ1
భవాని నగర్, కెటి రోడ్, తిరుపతి ఫోన్: 9849330660

### కోరమంగళ

మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
సైట్-2, బి బ్లాక్, 100 ఫీట్‌రోడ్, కోరమంగళ ఎక్స్‌టెన్షన్,
బెంగుళూరు. ఫోన్: 09108446553

### బెంగుళూరు

మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
57/1, ఈస్ట్‌పార్క్‌రోడ్, మల్లేశ్వరం,
బెంగుళూరు. ఫోన్: 09108446553

### హొసూరు

విజయ్ సృష్టి ఫెర్టిలిటి సెంటర్,
నెం: 76, ఓల్డ్ బెంగుళూరు రోడ్, హొసూర్
ఫోన్: 09944827846

### కర్నూలు

మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
డోర్ నెం: 50-760, ఫస్ట్ ఫ్లోర్, విశ్వభారతి హాస్పిటల్ లేన్,
గాయత్రి ఎస్టేట్స్, కర్నూలు, ఫోన్: 09849330660



### ప్రొద్దుటూరు

## పద్మ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్

ప్రొద్దుటూరు, కడప జిల్లా ఫోన్ : 9100775988,
9704555302

### త్వరలో!.. హైదరాబాదు

• టాప్ స్టోరీస్



• జాతీయాలు

## ఘట్టకుటీ ప్రభాతం

**త**ప్పించుకోవాలని ప్రయత్నించినా ఏదో విధంగా దొరికిపోయే సందర్భంలో ఉపయోగించే జాతీయం ఇది.

'నా నుంచి తప్పించుకోవాలని నానా రకాలుగా ప్రయత్నించాడు. కానీ ఏంలాభం? చివరికి ఘట్టకుటీ ప్రభాతం అయింది' అంటుంటారు.

ఘట్టం అంటే పన్నులు వసూలు చేసే స్థలం.

కుటీ అంటే గుడిసె.

ప్రభాతం అంటే తెల్లవారడం.

పూర్వం రాజుల కోటల్లో సింహద్వారం ఉండేది.

ప్రజల రాకపోకలన్నీ ఈ సింహద్వారం నుంచే కొనసాగేవి. పన్నులు వసూలు చేసే అధికారులు ఇక్కడ ఒక గుడిసెలో ఉండేవారు. రాకపోకలన్నీ సింహద్వారం నుంచే కాబట్టి పన్నులు ఎగ్గొట్టాలనుకునే వారి పప్పులు ఉడికేవి కావు. చచ్చినట్లు పన్ను కట్టాల్సి వచ్చేది.

వెనకటికి ఒక వ్యాపారి పన్ను ఎగ్గొట్టడానికి ప్రయత్నించాడు. పన్నులు వసూలు చేసే అధికారులు మాంచి నిద్రలో ఉండగా వారి కనుగప్పి తప్పించుకుపోదామనుకున్నాడు. అయితే ఊరంతా తిరిగి ఆ పన్నులు వసూలు చేసే గుడిసె దగ్గరికి వచ్చే సమయానికి ప్రభాతమైంది...అంటే తెల్లవారిందన్న మాట. దీనితో ఆ వ్యాపారి పన్ను కట్టక తప్పలేదు! ఈ కథలో నుంచి పుట్టిన జాతీయమే 'ఘట్టకుటీ ప్రభాతం'.





## ఘుణాక్షరం

ఏదైనా రాయడానికి కాగితం మీద పెన్నుతో రాస్తున్నాం లేదా టైప్ చేస్తున్నాం.

పూర్వం మాత్రం తాటాకులు తప్ప వేరే మార్గం లేదు.

తాటాకులపై గంటంతో రాసేవారు.

అయితే బాగా పాతబడిన తాటాకులకు పురుగులు పట్టేవి. ఆ క్రమంలో కొత్త కొత్త ఆకారాలు తాటాకుల మీద ఏర్పడేవి. కొన్ని అయితే అచ్చం అక్షరాల్లా ఉండేవి. వీటిని ఘుణాక్షరాలు అనేవాళ్లు.

ఏ ఉద్దేశం లేకుండా ఒక పని చేయడాన్ని 'ఘుణాక్షరం'తో పోల్చుతారు.

'అది ఉద్దేశపూర్వకంగా చేసిన పని కాదు... ఘుణాక్షరం' అంటుంటారు.

## చవితి చంద్రుడు!

**'తె**లిసో తెలియకో చిన్న పొరపాటు చేశాను. ఈ మాత్రం దానికే నన్ను చవితి చంద్రుడిని చేశారు'

'నన్ను చూడడానికి కూడా భయపడుతున్నావు. నేనేమైనా చవితి చంద్రుడినా ఏమిటి?'....ఇలా రకరకాల సందర్భాలలో 'చవితి చంద్రుడు' అనే మాటను ఉపయోగించడం చూస్తూనే ఉంటాం.



చవితి రోజు భూలోకంలో నైవేద్యం ఆరగించిన వినాయకుడు కైలాసం చేరుకొని తల్లిదండ్రులకు నమస్కరించడానికి ప్రయత్నించాడుగానీ భుక్తాయాసం వల్ల అది సాధ్యం కావడం లేదు.

వినాయకుడు పడే ఇబ్బందిని చూసి శివుడి తలలోని చంద్రుడు నవ్వాడు.



తన కుమారుడిని చూసి నవ్వినందుకు...

''నిన్ను చూసిన వారంతా నీలాపనిందలతో బాధపడుగాక'' అని శపించింది పార్వతిదేవి.

ఆ తరువాత మాత్రం ఈ శాపం శుద్ధ చవితికి మాత్రమే పరిమితమైంది.

## యక్షప్రశ్నలు

**పాం**డవులు వనవాసంలో ఉన్నప్పుడు... ధర్మరాజుని పరీక్షించడానికి యక్షుని రూపంలో యమధర్మరాజు అడిగిన ప్రశ్నలే యక్షప్రశ్నలు. సూర్యుడిని ఉదయింపచేయువారు ఎవరు? సూర్యుడిని అస్తమింపచేయునది ఏది? జీవన్మృతుడెవరు? భూమి కంటే భారమైనది ఏది? గాలి కంటే వేగమైనది ఏది? జన్మించి కూడా ప్రాణం లేనిది ఏది? రూపం ఉన్నా హృదయం లేనిది ఏది? మనిషికి ఆత్మ ఎవరు....ఇలా యక్షుని రూపంలో యమధర్మరాజు అడిగిన ప్రశ్నలకు ధర్మరాజు తగిన విధంగా సమాధానం ఇస్తాడు.

ఇక వ్యవహారంలోకి వస్తే....

ఎవరైనా చిక్కుప్రశ్నలు, కఠిన ప్రశ్నలు వేసే సందర్భంలో ఉపయోగించే మాట...యక్ష ప్రశ్నలు!




ఫన్‌డే మీద మీ అభిప్రాయాలను, సూచనలను మాకు తెలియజేయండి. ప్రియదర్శిని రామ్, ఎడిటర్, ఫన్‌డే, సాక్షి దినపత్రిక, 6-3-249/1, రోడ్ నం.1, బంజారాహిల్స్, హైదరాబాద్ - 34. funday.sakshi@gmail.com

బుక్ డిజైనింగ్: కుసుమ

• విడ్డూరం

# సూపర్ హ్యూమన్!

సైన్స్‌ఫిక్షన్‌లో మనం చదువుకొని ఆశ్చర్యపడిన విషయాలన్నీ నిజ జీవితంలో ఆచరణలోకి వచ్చి అబ్బురపరిచాయి. శాంటి కొర్ఫోరాల్ వ్యవహారం కూడా అంతే.

సిడ్నీ(ఆస్ట్రేలియా)కు చెందిన కొర్ఫోరాల్ తన హస్తాల్లో మైక్రోచిప్స్‌ను అమర్చుకున్నారు. దీనివల్ల ఆమె... తాళం చెవి లేకుండానే డోర్ ఓపెన్ చేయవచ్చు. ఎలాంటి పరికరం లేకుండానే కారు డోర్స్‌ను ఓపెన్ చేయవచ్చు. పాస్‌వర్డ్ ఉపయోగించకుండానే కంప్యూటర్‌లోకి వెళ్ల వచ్చు. మైక్రోచిప్స్ బియ్యపు గింజ ఆకారంలో ఉంటాయి.



కొర్ఫోరాల్




ఇది మాత్రమే కాదు... పర్స్‌లు, కార్డులలాంటివేమీ ఉపయోగించకుండా కొత్తదారిలో ప్రయాణించాలనేది ఆమె భవిష్యత్ కల.

పాస్‌వర్డ్‌లు, పిన్ నెంబర్లు అవసరం లేని సరికొత్త జీవితం చూడొచ్చు అంటుంది కొర్ఫోరాల్.

''ఆ తరువాత ఏమిటి? అనేదానికి ఆకాశమే హద్దు'' అంటున్న కొర్ఫోరాల్ పరికరాల సహాయం లేకుండా ఎన్నో పనులు చేయాలని కలలు కంటోంది.

కలలు కనడమే కాదు ఇంప్లాంట్స్ కోసం భర్త స్టీవెన్స్‌తో కలిసి 'చిప్ మై లైఫ్' పేరుతో డిస్ట్రిబ్యూషన్ సర్వీస్‌ను మొదలుపెట్టింది.

సూపర్ హ్యూమన్‌లు నిజ జీవితంలో కూడా కనిపించే రోజు ఇంకెంతో కాలం లేదని అంటోంది కొర్ఫోరాల్.

• న్యూ ఫేస్

# ముఖకాంతికి చిరోంజిపప్పు ఫేస్‌మాస్క్



**చ**ర్మకాంతి మెరుపులీనుతూ కనిపించాలంటే మనం తీసుకునే జాగ్రత్తలపైనే ఆధారపడి ఉంటుంది. రోజూ సమతుల ఆహారం తీసుకోవడంతో పాటు విటమిన్ ‘ఇ’, ఒమేగా ఫ్యాటీ గుణాలు పుష్కలంగా ఉండే చిరోంజి పప్పుతో మేనికి మెరుగులు పెట్టుకోవచ్చు.

- మూడు టేబుల్ స్పూన్ల చిరోంజి పప్పు, అర కప్పు పాలు తీసుకోవాలి.
- రాత్రిపూట ఈ రెండింటినీ కలిపి నానబెట్టాలి.
- మరుసటి రోజు ఉదయం బాగా నానిన ఈ పప్పును మెత్తగా రుబ్బుకోవాలి.
- దీంట్లో 2–3 రేకలు కుంకుమపువ్వు వేసి కలపాలి.
- ఈ మిశ్రమాన్ని ముఖానికి, మెడకు, గొంతుకు రాయాలి.
- మృదువుగా వేళ్లతో 2–3 నిమిషాలు మర్దనా చేయాలి. అరగంట పాటు వదిలేయాలి.
- చల్లని నీటితో శుభ్రంగా కడిగేయాలి.
- రోజూ ఈ ప్యాక్ వేసుకుంటే నల్లని మచ్చలు, కళ్లకింద వలయాలు తగ్గిపోతాయి. చర్మకాంతి పెరుగుతుంది.

**నోట్:** చిరోంజి పప్పు లేకపోతే పొద్దుతిరుగుడు గింజలతో ఇలాగే ప్యాక్ చేసుకొని వాడుకోవచ్చు.

• మీకు తెలుసా





రెండు ఖండాలలో ఉన్న ప్రపంచంలోని ఏకైన నగరం ఇస్తాంబుల్. యూరప్, ఆసియా ఖండాలలో ఇస్తాంబుల్ (టర్కీ) ఉంది.

# పేదలకు ప్రేమతో...



రూపాయితో కడుపునిండా కమ్మటి భోజనం



ఒక్క రూపాయితో ఆకలి తీరుతుందా?

ఆకలి తీరడం వరకు ఎందుకు? సింగిల్ టీ కూడా తాగలేము.

కానీ అక్కడికి ఒక్క రూపాయితో వెళితే చాలు... కమ్మని భోజనంతో కడుపు నిండుతుంది. తమిళనాడులోని ఈరోడ్ పట్టణంలో గత ఎనిమిది సంవత్సరాలుగా ఒక్కరూపాయికి పేదసాదలకు కడుపునిండా భోజనం పెడుతున్నాడు వెంకట్రామన్.

ఈరోడ్ జనరల్ హాస్పిటల్ సమీపంలో తాను నిర్వహిస్తున్న 'ఏఎంవీ హోమ్లీ మెస్'లో ఒక్క రూపాయికే పేదలకు భోజనం సమకూరుస్తున్నడు వెంకట్రామాన్.

ప్రతి మంచి పని వెనుక ఏదో ఒక సంఘటన ఉంటుంది. వెంకట్రామన్ విషయంలోనూ ఇది జరిగింది. ఎనిమిది సంవత్సరాల క్రితం ఒక యువతి సమీపంలోని ప్రభుత్వ ఆస్పత్రి నుంచి వెంకట్రామన్ రెస్టారెంట్‌కు వచ్చింది. ఆమె ఇడ్లీలు కొనడానికి వచ్చింది.

ఆరు ఇడ్లీలకు పది రూపాయలు.

పది రూపాయలు పెట్టి ఇడ్లీలు కొనడానికి ఆమె సుముఖంగా లేకపోవడంతో దోశలు కొనమని చెప్పాడు వెంకట్రామన్. పది రూపాయలకు మూడు దోశలు. మూడు దోశలు తన కుటుంబానికి సరిపోవంటూ కొనడానికి తిరస్కరించింది. ఆమె పరిస్థితికి జాలి పడి పది రూపాయలకే ఆరు దోశలు ఇచ్చాడు వెంకట్రామన్.

వేరే రెస్టారెంట్ యజమానులు అయితే ఈ సంఘటనను ఇక్కడితో మరిచిపోయి ఉండేవారు. అయితే వెంకట్రామన్ చాలా రోజుల వరకు ఈ సంఘటనను మరవలేకపోయాడు. కొందరు కేవలం పది రూపాయల మీదే రోజంతా వెళ్లదీస్తున్న కఠిన వాస్తవాన్ని గ్రహించాడు. ప్రభుత్వ ఆస్పత్రికి వెళ్లి పేద రోగుల దీన పరిస్థితిని, ఆకలిని కళ్లారా చూశాడు. మనసు కదిలిపోయింది.



లేడీస్ టైలర్
23వ పేజీలో

''నా పరిధిలో ఏదైనా చేయాలి'' అని అప్పుడే గట్టిగా అనుకున్నాడు వెంకట్రామన్.

తన భార్యతో కలిసి రోజూ పొద్దున హాస్పిటల్‌కు వెళ్లి పేదవారికి రూపాయి కూపన్ ఇస్తాడు. కూపన్ తీసుకున్నవారు మధ్యాహ్నం రెస్టారెంట్‌కు వెళ్లి భోజనం తెచ్చుకుంటారు.

ఒకప్పుడు 20 మందికి టోకెన్లు ఇచ్చేవాడు. ఇప్పుడు 70 మందికి ఇస్తున్నాడు.

ఈ రెస్టారెంట్‌లో రెగ్యులర్ కస్టమర్ల విభాగం కూడా ఉంది. అక్కడ మాత్రం ప్లేట్ భోజనం రూ.50కి విక్రయిస్తారు.

రూపాయి భోజనానికయ్యే ఖర్చు కోసం మొదట్లో ఎవరీ దగ్గర సహాయం తీసుకోలేదు వెంకట్రామన్. తన రెస్టారెంట్ లాభాల నుంచే ఈ మొత్తాన్ని కేటాయించేవాడు. అయితే రెస్టారెంట్‌కు వచ్చే లాభాలు తక్కువ కావడంతో ఖర్చులు సర్దుబాటు చేయడం కష్టంగానే ఉండేది. అయితే వెంకట్రామన్ చేస్తున్న పని నచ్చి అడగకుండానే దాతలు ఆయనకు విరాళాలు ఇవ్వడం ప్రారంభించారు.

వెంకట్రామన్ కూతురికి ఇంజనీరింగ్ కాలేజీలో సీటు వచ్చినప్పుడు కాలేజీ ఫీజు కట్టడానికి అతని దగ్గర డబ్బులేదు. ఇది తెలిసిన చెన్నై రామక్రిష్ణ మఠ్ వెంకట్రామన్ కూతురు ఇంజనీరింగ్ కాలేజీలో అడ్మిషన్ పొందడానికి అవసరమైన సహాయం చేసింది.

''కష్టం ఉందని బాధ పడనక్కర్లేదు. ఆ కష్టాన్ని తీర్చే ఆపన్న హస్తం కూడా ఎక్కడో ఒక చోట ఉంటుంది'' అని నమ్ముతాడు వెంకట్రామన్.

''చదువు అయిపోయిన తరువాత నా కూతురుకు మంచి ఉద్యోగం వస్తుంది. అప్పుడు నేను మరింత ఎక్కువ మందికి సహాయం చేయగలను'' అంటున్నాడు వెంకట్రామన్.

యోగా టీచర్‌గా పని చేస్తున్న వెంకట్రామన్ భార్య తనవంతుగా సహాయం అందిస్తోంది.

''పేద కుటుంబం నుంచి వచ్చాను. ఇప్పటికీ నేనేమీ ఆర్థికంగా స్థిరపడలేదు. అయినా... ఒక్క రూపాయికి భోజనం మాత్రం సమకూర్చడాన్ని మాత్రం మానుకోను. రోజుకు వంద కూపన్లు ఇవ్వాలన్నదే నా లక్ష్యం'' అంటున్నాడు వెంకట్రామన్.

''మానవత్వం అనేది సముద్రం లాంటిది. అందులో రెండు చుక్కలు కలుషితం అయినంత మాత్రాన... సముద్రం అంతా కలుషితం కాదు'' అంటారు మహాత్మగాంధీ.

వెంకట్రామన్ చేస్తున్న మంచిపనిని గుర్తు తెచ్చుకున్నప్పుడల్లా మహాత్ముడి మాటలు గుర్తుకు వస్తాయి. మానవత్వం మీద పూర్తి నమ్మకం ఏర్పడుతుంది. ఈ కాలానికి ఇంత కంటే కావాల్సింది ఏముంది!

## • కిసుక్కు

టీచర్: భూమి మీద ప్రాచీన జంతువు ఏది?

స్టూడెంట్: జీబ్రా... ఎందుకంటే అది ఇంకా బ్లాక్ అండ్ వైట్‌లోనే ఉంది.

## • మీకు తెలుసా

1996లో చికాగో బ్రూక్‌ఫీల్డ్ జూ ఎన్‌క్లోజర్‌లో ఒక పిల్లాడు ప్రమాదవశాత్తు కిందపడ్డాడు. అక్కడ ఉన్న ఆడ గోరిల్లా బింటి ఇతర జంతువుల నుంచి ఆ పిల్లాడికి రక్షణగా నిలిచింది.

● కవర్ స్టోరీ



సెప్టెంబర్ 4 గూగుల్ వార్షికోత్సవం,
సెప్టెంబర్ 5 గురుపూజోత్సవం సందర్భంగా...

# గూగుల్ దేవోభవ!

ఆవకాయను ఎలా తయారు చేయాలి?
'గూగుల్'ను అడిగితే చాలు...
సచిత్ర పాఠం క్షణాల్లో కళ్ల ముందు ఉంటుంది.
అంతరిక్ష విజ్ఞానంలో తాజా పరిణామాలేంటి?
'గూగుల్'ను అడిగితే చాలు...
సమస్త సమాచారమూ సమగ్రంగా
చిటికెలో ప్రత్యక్షమవుతుంది.
కొరుకుడు పడని పాఠాలేవైనా కావచ్చు,
కోరుకున్న విద్యలేవైనా కావచ్చు...
'గూగుల్'ను అడిగితే చాలు...
యమ ఓపికగా పండు ఒలిచి చేతిలో పెట్టినంత
చక్కగా వివరిస్తుంది.
బెత్తం పట్టుకోదు, గుంజీలు తీయించదు,
గోడ కుర్చీలు వేయించదు...
ఎలాంటి పాఠాలనైనా ఏమాత్రం
కసురుకోకుండా ఫ్రెండ్లీగా బోధిస్తుంది.
ఎలాంటి సందేహాన్నైనా ఏమాత్రం
విసుక్కోకుండా చిటికెలో తీర్చేస్తుంది.
ఈ-తరానికి గురువూ, దైవం గూగుల్.
ఈ-తరానికి ఫ్రెండ్, ఫిలాసఫర్ అండ్ గైడ్ గూగుల్.
గూగుల్ ఒక జ్ఞాన నిధి, ఒక విజ్ఞాన ఖని.



పద్దెనిమిదేళ్ల కిందట సాదాసీదా సెర్చ్ ఇంజన్‌గా 'గూగుల్' మొదలైనప్పుడు అది నిరంతర సమాచార ఖనిగా పరిణమించగలదని, అంచెలంచెలుగా విస్తరించి విశ్వవ్యాప్తమై అధునాతన ప్రపంచంలో అనేకానేక ఏకలవ్య శిష్యులకు జగద్గురువుగా అవతరించగలదని ఎవరూ ఊహించలేదు. గూగుల్ ప్రస్థానం అభూత కల్పనల కంటే విడ్డూరమైనది. గూగుల్ సాధించిన విజయాలు ఇంటర్నెట్ ప్రపంచంలోని ఇతరేతర శతకోటి విజయాల కంటే ఘనమైనవి. 'ఆచార్య దేవో భవ' అని గురువులను గౌరవించడం మన సంస్కృతి. దాదాపు ఇంటింటికీ ఇంటర్నెట్ విస్తరించడంతో సమాచార విప్లవంలో 'గూగుల్' గురుతర పాత్ర పోషిస్తోంది. శాస్త్ర సాంకేతికాలకు మాత్రమే పరిమితం కాకుండా వంటావార్పు వంటి సామాన్య విషయాలపైనా పాఠాలు బోధిస్తోంది. ఈ-తరానికి గురువుగా మారిన గూగులాచార్యుల కథా కమామిషూ...

**చదువులెంత సులభం!**

చదువుల తీరుతెన్నుల చరిత్రను ఇప్పుడు ఎవరైనా రాస్తే, ఆ చరిత్రను గూగుల్ పూర్వ యుగం, గూగుల్ అనంతర యుగంగా విభజించుకోవడం అనివార్యం. ఇంటర్నెట్ అనేది ఊహకందని కాలంలో, గూగుల్ అనే సమాచార ఖని అందుబాటులోకి రాని కాలంలో చదువులు బహు కష్టంగా ఉండేవి. పాఠాలు నేర్చుకునే విద్యార్థులకే కాదు, పాఠాలు నేర్పే గురువులకు కూడా! పొల్లు పోకుండా పాఠాలను వల్లె వేయాల్సి వచ్చేది. పరీక్షలకు ముందు అవే పాఠాలను పదే పదే బట్టీ పట్టాల్సి వచ్చేది. అయినా ఒక పట్టాన గుర్తుండి చచ్చేవి కాదు. చాలా అంశాల్లో ఏమిటి? ఎందుకు? ఎలా? అనే మౌలికమైన ప్రశ్నలకు పాఠ్యపుస్తకాల్లో ఉన్న సమాధానాలు అర్థమయ్యీ కానట్లు ఉండేవి. రకరకాల సందేహాలు తలెత్తేవి. వెనువెంటనే వాటిని నివృత్తి చేసుకునే మార్గమే అందుబాటులో ఉండేది కాదు. కొత్త పదాలు వేటికైనా అర్థాలు తెలుసుకోవాలంటే దిండు సైజులో కొండలా ఉండే నిఘంటువుల్లో పేజీలకు పేజీలు ఓపికగా తిరగేస్తూ వెదుక్కోవాల్సి వచ్చేది. కొరుకుడుపడని సబ్జెక్టుల్లో ఏవైనా సందేహాలు తలెత్తినా, టీచర్లను అడగాలంటే భయ సంకోచాలు వెంటాడేవి. ఓపికగా సందేహాలను నివృత్తి చేసే టీచర్లు కొద్ది మంది మాత్రమే ఉండేవారు. చాలామంది టీచర్లు కోపతాపాలను ప్రదర్శించేవారు. ఇవన్నీ విద్యార్థుల కష్టాలు. అయితే, టీచర్ల కష్టాలు టీచర్లకూ ఉండేవి. తమకే తెలియని విషయాలపై సందేహాలతో నిత్యం విసిగించే విద్యార్థులతో వేగడం అగ్నిపరీక్షలా ఉండేది. అపర చండామార్కుల వంటి టీచర్లు అలాంటి గడ్డు పరిస్థితులను దండోపాయంతో నెట్టుకొచ్చేసేవారు. అయితే, టీచర్లందరూ దండోపాయ దురంధరులగు చండామార్కుల వారసులు కాదు కదా! వాళ్లల్లోనూ అమాయకపు పరమానందయ్యలు ఉంటారు. పాపం అలాంటి వాళ్లకే కష్టాలన్నీ... పైగా విద్యార్థులకు కూడా పరమా



సెర్జీ బ్రిన్



ల్యారీ పేజ్




సుందర్ పిచయ్

నందయ్యల వంటి టీచర్ల దగ్గరే కాస్త చనువెక్కువ. అందుకే వాళ్లనే పదే పదే సందేహాలతో సతాయిస్తూ ఉంటారు. 'గూగుల్' పుట్టుకకు మునుపు గడచిన సత్తెకాలంలో విద్యార్థులకు, ఉపాధ్యాయులకు చదువులు సవాలుగా ఉండేవి. 'గూగుల్' ఆవిర్భావం తర్వాత చాలావరకు కష్టాలు తీరిపోయాయి. చదువులు సులభమయ్యాయి. ఎలాంటి సందేహమైనా సరే, నివృత్తి చేసుకోవడం ఒక క్లిక్కుతో జరిగే పనిగా మారింది.

### ఇద్దరు మిత్రుల కథ

పాతికేళ్ల కిందట ఇంటర్నెట్ అందుబాటులోకి వచ్చింది. బ్రిటిష్ శాస్త్రవేత్త సర్ టిమ్ బెరర్స్ లీ తొలిసారిగా 1989 మార్చి 12న 'వరల్డ్ వైడ్ వెబ్' ప్రతిపాదన చేశారు. మొదటి సెర్చ్ ఇంజన్ 'ఆర్చీ' 1990లో ఏర్పాటైంది. ఆ తర్వాత 1991 ఆగస్టులో మొట్టమొదటి వెబ్‌సైట్ 'ఇన్ఫో.సెర్న్.సీహెచ్' ఏర్పడింది. కంప్యూటర్ల నుంచి కంప్యూటర్లకు సమాచార మార్పిడి తేలికైంది. ఈ-మెయిల్ సౌకర్యం అందుబాటులోకి వచ్చింది. వెబ్‌సైట్లు ఒక్కొక్కటే ఏర్పడసాగాయి. విద్యారంగంలో నెమ్మదిగా హైటెక్కు టమారాలన్నీ మొదలవసాగాయి. అలాంటి కాలంలో... 1996లో ల్యారీ పేజ్, సెర్జీ బ్రిన్ అనే అమెరికన్ కుర్రాళ్లు స్టాన్‌ఫోర్డ్ యూనివర్సిటీలో ఒకరినొకరు కలుసుకున్నారు. ఇద్దరూ పీహెచ్‌డీ స్కాలర్లే! పాపం అప్పటికి అబ్దుల్ కలాం వాళ్లకేమీ చెప్పలేదు గాని, వాళ్లిద్దరూ ఒక పెద్ద కల కన్నారు. ఇంటర్నెట్‌లోని సమస్త సమాచారాన్నీ ఒకేచోట అందుబాటులోకి తేవాలన్నదే వారి కల. దానిని సాకారం చేసుకోవడానికి 1997 సెప్టెంబర్ 15న 'గూగుల్ డాట్ కామ్' డొమైన్ పేరును నమోదు చేసుకున్నారు. ఏడాది గడవకుండానే... 1998 సెప్టెంబర్ 4న గూగుల్ కంపెనీని ఏర్పాటు చేశారు. తమ తోటి పీహెచ్‌డీ సహాధ్యాయి క్రెయిగ్ సిల్వర్‌స్టీన్‌ను తొలి ఉద్యోగిగా చేర్చుకున్నారు. అప్పట్లో వాళ్లు కాలిఫోర్నియాలోని మెన్లో పార్కు ప్రాంతంలో సూసాన్ వోజ్‌సికి అనే స్నేహితురాలి ఇంటి గ్యారేజీలో కార్యాలయాన్ని ఏర్పాటు చేసుకున్నారు. అలా మొదలైన ప్రస్థానం రెండు దశాబ్దాలైనా గడవక ముందే అనేకానేక మైలురాళ్లను అధిగమించింది. ప్రపంచవ్యాప్తంగా విస్తరించింది. కేవలం సెర్చ్ ఇంజన్‌గా మాత్రమే పరిమితమైపోకుండా, సమాచార సాంకేతిక పరిజ్ఞానంలో 'గూగుల్ ఎర్త్' వంటి వినూత్నమైన సేవలను ప్రారంభించింది. అనూహ్యంగా అసంఖ్యాక ఘనవిజయాలను సొంతం చేసుకుంది. ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా చాలా నగరాల్లో గూగుల్ కార్యాలయాలు పనిచేస్తున్నాయి. 'గూగుల్' సంస్థ నికర విలువ ఇప్పుడు 49,800 కోట్ల డాలర్లకు పైమాటే. తాజా లెక్కల ప్రకారం 'గూగుల్'లో 57,100 మంది సిబ్బంది పనిచేస్తున్నారు. ఐటీ విద్యార్థులందరి కలల లక్ష్యం 'గూగుల్'లో ఉద్యోగమేనంటే అతిశయోక్తి కాదు. 'గూగుల్'లో ఉద్యోగమంటే రాజ వైభోగమేనని చెబుతారు.

## గూగుల్ సారథిగా భారతీయుడు

ఇద్దరు అమెరికన్ కుర్రాళ్లు ప్రారంభించగా, అంచెలంచెలుగా ఎదిగి, ప్రపంచవ్యాప్తంగా విస్తరించిన 'గూగుల్' కంపెనీకి సారథిగా సుందర్ పిచయ్ గత ఏడాది బాధ్యతలు స్వీకరించారు. గత ఏడాది చేపట్టిన కార్పొరేట్ పునర్వ్యవస్థీకరణలో భాగంగా 'అల్ఫాబెట్'కు 'గూగుల్' అనుబంధ సంస్థగా మారింది. 'గూగుల్' వ్యవస్థాపకుల్లో ఒకరైన ల్యారీ పేజ్ 'అల్ఫాబెట్'కు సీఈవోగా బాధ్యతలు స్వీకరించగా, మరో వ్యవస్థాపకుడు సెర్జీ బ్రిన్ 'అల్ఫాబెట్' ప్రెసిడెంట్‌గా బాధ్యతలు చేపట్టారు. గూగుల్ సీఈవోగా సుందర్ పిచయ్‌ని నియమించారు. ఖరగ్‌పూర్ ఐఐటీ పట్టభద్రుడైన తర్వాత అమెరికాలో ఉన్నత విద్యలు పూర్తి చేసుకున్న సుందర్ పిచయ్ 2004లో 'గూగుల్'లో చేరి, వివిధ కీలక బాధ్యతలను సమర్థంగా నిర్వహించారు. ప్రస్తుతం సీఈవోగా ఆయన 'గూగుల్' పురోగతిలో కీలక పాత్ర పోషిస్తున్నారు.

### గూగుల్ నీడలో విద్యా వేదికలు

'బ్లాగర్', 'యూట్యూబ్' వంటివి 'గూగుల్' నీడలోనివే. ఇవి అందిస్తున్న సేవలు సమాచార విప్లవంలో కొత్త శకానికి నాంది పలికాయి. అంతేనా!




చదువు సంధ్యల్లోనూ ఇవి తమదైన ముద్ర వేస్తున్నాయి. 'గూగుల్' దెబ్బతో ఇప్పుడు ఇంటర్నెట్ ఒక అనధికారిక ఓపెన్ యూనివర్సిటీలా మారింది. చదువుకోదలచిన వాళ్లకు చదువుకునేంత సమాచారం అందుబాటులో ఉంటోంది. ఔత్సాహిక రచయితలకు 'బ్లాగర్' అద్భుతమైన వేదికగా మారింది. తమకు తెలిసిన విజ్ఞానాన్ని పదిమందితో పంచుకోవడానికి, తమ సృజనాత్మకతను లోకానికి చాటుకోవడానికి 'బ్లాగర్' చక్కని



## గూగుల్ గురించి అవీ... ఇవీ...

- తొలినాళ్లలో గూగుల్ సెకనుకు 30-40 పేజీలను మాత్రమే ప్రాసెస్ చేయగలిగేది. ఇప్పుడు ఏకంగా కొన్ని మిలియన్ల పేజీలను ప్రాసెస్ చేయగలుగుతోంది. పద్దెనిమిదేళ్ల వ్యవధిలోనే 'గూగుల్' తన వేగాన్ని అపరిమితంగా పెంచుకుంది.
- ఇంటర్నెట్‌లో గూగుల్ కంటే 'యాహూ' నాలుగేళ్ల సీనియర్ సంస్థ. 'గూగుల్' శరవేగంగా ఎదుగుతుండటంతో, దానిని కొనుగోలు చేయాలని 'యాహూ' భావించింది. 'గూగుల్' కొనుగోలుకు 2002లో 300 కోట్ల డాలర్లు ఇవ్వజూపింది కూడా. అయితే, 'గూగుల్' వ్యవస్థాపకులు ఆ ఆఫర్‌ను తోసిపుచ్చారు.
- 'గూగుల్' స్పెల్లింగ్ ఒక అచ్చుతప్పు. 'గూగుల్' అసలు స్పెల్లింగ్ 'జీఓఓజీఓఎల్'. అంటే, ఒకటి తర్వాత వంద సున్నాలు పెడితే వచ్చే సంఖ్య అన్నమాట.
- 'గూగుల్' తొలిదశలో రూపొందించిన అల్గారిథమ్ 'పేజ్‌ర్యాంక్' పేటెంట్ ఇప్పటికీ స్టాన్‌ఫోర్డ్ వర్సిటీ అధీనంలోనే ఉంది.
- 'గూగుల్' హోమ్‌పేజీలో ఇప్పుడైతే వివిధ సందర్భాల్లో డూడుల్స్ కనిపించడం మామూలైంది గాని, తొలి రోజుల్లో 'గూగుల్' లోగో యథాతథంగానే కనిపించేది. అయితే, గూగుల్ వ్యవస్థాపకులు ల్యారీ పేజ్, సెర్గీ బ్రిన్‌లు నెవడాలో జరిగే 'బర్నింగ్ మ్యాన్ ఫెస్టివల్' వేడుకల్లో పాల్గొనడానికి వెళ్లారు. తాము కార్యాలయంలో ఉండటం లేదనే సమాచారాన్ని యూజర్లకు తెలియజేసేందుకు తొలిసారిగా అప్పుడు 'బర్నింగ్ మ్యాన్' డూడుల్‌ను హోమ్‌పేజీలో పెట్టారు. దానికి స్పందన బాగుండటంతో ప్రత్యేక సందర్భాల్లో డూడుల్స్ పెట్టడాన్ని అలవాటుగా చేసుకున్నారు.
- 'గూగుల్' హోమ్‌పేజీలో లోగో, సెర్చ్ బాక్స్ తప్ప మిగిలిన భాగమంతా తెల్లగా ఖాళీగానే ఉంటుంది. మిగిలిన వెబ్‌సైట్ల హోమ్‌పేజీల మాదిరిగా అందులో ఎలాంటి రంగులు, చమక్కులు, డిజైన్లు కనిపించవు. ఎందుకంటే, 'గూగుల్' వ్యవస్థాపకులిద్దరికీ వెబ్‌పేజీ డిజైనింగ్‌కు అత్యవసరమైన హెచ్‌టీఎంఎల్‌లో పరిజ్ఞానం అంతంత మాత్రమే.
- 'గూగుల్' భాషపై కూడా తనదైన ముద్ర వేసింది. ఆక్స్‌ఫర్డ్, వెబ్‌స్టర్ డిక్షనరీలో 2006లో ముద్రించిన ఎడిషన్లలో 'గూగుల్' పదాన్ని క్రియాపదంగా గుర్తించాయి. ఇంటర్నెట్‌లో సమాచారాన్ని వెదుకులాడటానికి 'గూగులింగ్' అనడం ఏకపద ప్రత్యామ్నాయంగా మారింది.




వెసులుబాటు కల్పిస్తోంది. నిజానికి 'బ్లాగర్'ను 1999లో పైరా ల్యాబ్స్ ప్రారంభించగా, దీనిని 2003లో 'గూగుల్' సొంతం చేసుకుంది. ఇక 'యూట్యూబ్' వినోద, విజ్ఞానాల సమ్మేళనంగా ఉపయోగపడుతోంది. వీడియో షేరింగ్ వెబ్‌సైట్ 'యూట్యూబ్'ను 2005లో 'పేపాల్' ఉద్యోగులు కొందరు ప్రారంభించారు. ఆ మరుసటి ఏడాదిలోనే 'గూగుల్' దీనిని సొంతం చేసుకుంది. 'యూట్యూబ్'లో సినిమాలు, టీవీ సీరియల్ ఎపిసోడ్లు, క్రీడలు, పాటలు వంటివే కాదు, పలు విషయాలకు సంబంధించిన పాఠాల వీడియోలూ రోజూ అసంఖ్యాకంగా చేరుతూనే ఉంటాయి. వినోదం కోసం 'యూట్యూబ్'ను వినియోగించుకునే వారి సంగతి సరే, చాలామంది 'యూట్యూబ్' ద్వారా విలువైన పాఠాలను వ్యయప్రయాసలేవీ లేకుండానే నేర్చుకోగలుగుతున్నారు. గృహాలంకరణ వస్తువుల తయారీ, మొక్కల పెంపకం, వంటల తయారీ మొదలుకొని భౌతిక, రసాయనిక శాస్త్రాల ప్రయోగాలు, శస్త్రచికిత్సా ప్రక్రియల వరకు వివిధ అంశాల్లో పరిజ్ఞానాన్ని, వృత్తి నైపుణ్యాన్ని పెంచుకునేందుకు లక్షలాది మంది 'యూట్యూబ్'పై ఆధారపడుతున్నారు.



### ఈ-లెర్నింగ్...

'గూగుల్'తో ఎలాంటి సంబంధాలు లేని ఈ-లెర్నింగ్ వెబ్‌సైట్లు అసంఖ్యాకంగా ఉన్నాయి. అవన్నీ రకరకాల విషయాలను కూలంకషంగా బోధిస్తున్నాయి. ఇంటర్నెట్ మొదలైన కొద్దికాలంలోనే ఈ-లెర్నింగ్ యూజర్లకు అందుబాటులోకి వచ్చింది. దాదాపు 1999 నుంచే ఈ-లెర్నింగ్‌కు జనాదరణ పుంజుకుంది. అయితే,'గూగుల్' లేకుంటే... ఏయే వెబ్‌సైట్లు ఈ-లెర్నింగ్ సేవలను అందిస్తున్నాయో, ఏ సబ్జెక్టులను ఏయే వెబ్‌సైట్లు బోధిస్తున్నాయో జనాలకు తెలిసే అవకాశం ఉండేది కాదు. 'గూగుల్' పుణ్యాన చాలా ఈ-లెర్నింగ్ వెబ్‌సైట్లు జనాలకు చేరువయ్యాయి. మనకు నచ్చిన అంశాన్ని ఎన్నుకుని, ఆన్‌లైన్‌లో ఆ అంశాన్ని బోధిస్తున్న సంస్థలేవేవి ఉన్నాయో 'గూగుల్'ను అడిగితే క్షణాల్లో చెప్పేస్తుంది. అప్పటి వరకు మనం కనీవినీ ఎరుగని వందలాది వెబ్‌సైట్లను చిటికెలో పరిచయం చేస్తుంది. ఈ-లెర్నింగ్ ప్రక్రియను ప్రజలకు చేరువ చేయడంలో గూగుల్ గురుతర పాత్ర పోషిస్తోంది.

## గూగుల్ పరిమితులు...

**'అన్నీ వేదాల్లోనే ఉన్నాయష' అనే కాలం పోయి 'అన్నీ గూగుల్‌లోనే ఉన్నాయష' అనుకునే కాలం వచ్చిపడింది. పిడికిట్లోకి ప్రపంచం ఇమిడిపోయే దశలో దూసుకొచ్చిన గూగుల్ చాలామందికి గురువుగా మారింది సరే, గురువులకు పరిమితులు ఉన్నట్లే, గూగుల్ పరిమితులు గూగుల్‌కూ ఉన్నాయి. వాటిని గుర్తించకుండా గూగుల్ చెప్పిందే వేదమనే భ్రమలో పడితే మాత్రం తంటాలు తప్పవు. అందువల్ల గూగుల్ పరిమితుల్లో కొన్నింటి గురించి క్లుప్తంగా...**

- గూగుల్ సెర్చ్‌లో ఏదైనా పదం కొడితే, ఆ పదానికి సంబంధించిన సమస్త లింకులూ క్షణాల్లో ప్రత్యక్షమవుతాయి. ఒక్కో లింకు ఒక్కో వెబ్‌పేజీకి దారితీస్తుంది. కొన్ని వెబ్‌పేజీలలో ఇక్ష్వాకుల నాటి సమాచారం ఉంటుంది. పేజీని ప్రారంభించిన తర్వాత అప్‌డేట్ చేయకుండా ఏళ్ల తరబడి వదిలేసిన పేజీలు ఉంటాయి. అలాంటి సమాచారాన్ని నమ్ముకోలేం.
- వెబ్‌పేజీల్లో పొందుపరచిన విషయాలలోని నాణ్యతను, కచ్చితత్వాన్ని గుర్తించడం గూగుల్‌కే కాదు, ఏ సెర్చ్ ఇంజన్‌కూ సాధ్యం కాదు. వివిధ విషయాల రచనా నాణ్యతను, కచ్చితత్వాన్ని నిర్ధారించడం మానవ మేధస్సుకు మాత్రమే సాధ్యం.
- సాంకేతిక పురోగతి ఫలితంగా గూగుల్‌తో పాటు చాలా సెర్చ్ ఇంజన్లు హెచ్‌టీఎంఎల్‌లో లేని అంశాలను కూడా చాలావరకు చదవగలుగుతున్నాయి. అయినప్పటికీ తగిన వ్యాఖ్య, సమాచారం లేకుండా అప్‌లోడ్ చేసిన ఫొటోలు, ఆడియో, వీడియో సమాచారాన్ని విశ్లేషించడం ఇప్పటికీ వీటికి దుస్సాధ్యంగానే ఉంటోంది.
- వివిధ సాంకేతిక కారణాల వల్ల సెర్చ్ ఇంజన్లకు అందని వెబ్‌పేజీలు కూడా చాలానే ఉంటాయి. అలాంటి వెబ్‌పేజీలలో ఏదైనా విలువైన సమాచారం ఉన్నా, వాటి యూఆర్‌ఎల్ మనకు కచ్చితంగా తెలిస్తే తప్ప వాటిని చూడటం సాధ్యం కాదు. వాటిని వెదుకులాడటానికి సెర్చ్ ఇంజన్లపై ఆధారపడటం కష్టమే.

**- పన్యాల జగన్నాథదాసు**

# అరుదైన ఆచార్యుడు



పాఠాలు చెప్పే గురువులు చాలామందే ఉంటారు గానీ, విద్యార్థుల మనసులను ఆకట్టుకునే గురువులు చాలా అరుదుగా మాత్రమే ఉంటారు. విద్యార్థులు బ్రహ్మరథం పట్టే గురువులు మరీ అరుదుగా ఉంటారు. మన దేశానికి రెండవ రాష్ట్రపతి, మొదటి ఉపరాష్ట్రపతి అయిన డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ అత్యంత అరుదైన గురువుల కోవలోకి చెందుతారు. రాధాకృష్ణన్ కలకత్తా యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా పనిచేస్తుండగా, ఆయనకు మైసూరు వర్సిటీకి బదిలీ అయింది. కలకత్తాను వదిలి వెళ్లేటప్పుడు విద్యార్థులు ఆయనకు ప్రత్యేకంగా పూలతో అలంకరించిన బండిని ఏర్పాటు చేశారు. కలకత్తా యూనివర్సిటీ నుంచి రైల్వేస్టేషన్ వరకు విద్యార్థులే స్వయంగా బండిని లాగారు. తమ మనసులను చూరగొన్న గురువుకు ఆ విద్యార్థులు పలికిన అపురూపమైన వీడ్కోలు అది. ఇది స్వాతంత్ర్యానికి ముందు జరిగిన సంఘటన. దిగువ మధ్యతరగతి కుటుంబంలో జన్మించిన రాధాకృష్ణన్‌ను పూజారి చేయాలని ఆయన తండ్రి భావించేవారు. ఆర్థిక కష్టాల మధ్యనే రాధాకృష్ణన్ చదువు కొనసాగించి, తత్వశాస్త్రంలో ఎంఏ పూర్తి చేశారు. తర్వాత అధ్యాపకుడిగా జీవితం మొదలుపెట్టారు. భారతీయ తత్వశాస్త్రాన్ని మథించి ఆయన రాసిన 'ఇండియన్ ఫిలాసఫీ' అంతర్జాతీయంగా ప్రసిద్ధి పొందింది.

రాధాకృష్ణన్ మన దేశానికి రాష్ట్రపతిగా బాధ్యతలు స్వీకరించినప్పుడు బ్రిటిష్ తత్వవేత్త బెర్ట్రాండ్ రస్సెల్ 'ఇది తత్వశాస్త్రానికే లభించిన గౌరవం' అని హర్షం వ్యక్తం చేశారు. తత్వవేత్తలు పాలకులు కావాలని ప్లాటో కలలు కనేవాడని, భారత్‌కు ఒక తత్వవేత్త రాష్ట్రపతి కావడం విశేషమని, దీనికి ఒక తత్వవేత్తగా తాను గర్విస్తున్నానని అన్నారు. రాధాకృష్ణన్ రాష్ట్రపతి అయిన తర్వాత పూర్వ విద్యార్థులు కొందరు ఆయన పుట్టినరోజును ఘనంగా ఏర్పాటు చేయాలనుకున్నారు. అయితే, తన పుట్టినరోజును ఉపాధ్యాయులందరినీ గౌరవించుకునే రోజుగా పాటిస్తే సంతోషిస్తానని రాధాకృష్ణన్ చెప్పారు. అప్పటి నుంచి ఆయన పుట్టినరోజు సెప్టెంబర్ 5న గురు దినోత్సవంగా పాటించడం ఆనవాయితీగా వస్తోంది.





# జాతీయవాద వ్యాపారవేత్త కస్తూర్‌భాయ్ లాల్‌భాయ్

వ్యాపారం చేయడం ఆషామాషీ కాదు. అందునా ముక్కుపచ్చలారని పదిహేడేళ్ల కుర్రాడు నష్టాల్లో ఉన్న సంస్థను గాడిలో పెట్టి లాభాలబాట పట్టించడం అంత తేలికేమీ కాదు. విదేశీయుల పాలన కొనసాగుతున్న కాలంలో స్వదేశాభిమానాన్ని, స్వాభిమానాన్ని వదులుకోకుండానే ఈ ఘనతను సాధించారు కస్తూర్‌భాయ్ లాల్‌భాయ్. మన దేశం గర్వించదగ్గ తొలితరం పారిశ్రామికవేత్తల్లో అగ్రగణ్యులుగా ఎన్నదగిన అతి కొద్దిమందిలో కస్తూర్‌భాయ్ కూడా ఒకరు. గుజరాత్‌లోని జవేరీ


కస్తూర్‌భాయ్ లాల్‌భాయ్

వాడ్‌లో 1894 డిసెంబర్ 19న సంప్రదాయ జైన కుటుంబంలో జన్మించారు. ఆయన తండ్రి లాల్‌భాయ్ దళపత్‌భాయ్, తల్లి మోహిని. కస్తూర్‌భాయ్ పూర్వీకులు మొఘల్, బ్రిటిష్ పాలకుల హయాంలో అహ్మదాబాద్ నగరానికి కొత్వాల్‌లుగా పనిచేసేవారు. వారి వంశంలో తొలిసారిగా కస్తూర్‌భాయ్ తాత బాగ్‌భాయ్ వ్యాపారరంగంలోకి అడుగుపెట్టారు. ఆయన వస్త్రవ్యాపారం చేసేవారు. కస్తూర్‌భాయ్ తండ్రి లాల్‌భాయ్ దళపత్‌భాయ్ 1896లో సరస్‌పూర్ కాటన్ మిల్లును స్థాపించారు. కస్తూర్‌భాయ్ విద్యాభ్యాసం అహ్మదాబాద్‌లో సాగింది. పదిహేడో ఏట కాలేజీలో చేరిన మొదటి ఏడాదిలోనే తండ్రి లాల్‌భాయ్ మరణించారు. చదువు మానేయాల్సి వచ్చింది. ఆస్తి పంపకాల్లో భాగంగా కస్తూర్‌భాయ్ వాటాకు రాయ్‌పూర్ మిల్లు వచ్చింది.

### కార్మికులతో సమానంగా...

రాయ్‌పూర్ మిల్లు కస్తూర్‌భాయ్ చేతికి వచ్చే నాటికి మిల్లు నష్టాల్లో ఉండేది. పరిస్థితిని చక్కదిద్దడానికి కస్తూర్‌భాయ్ అహరహం మిల్లు అభివృద్ధికి పాటుపడ్డారు. కార్మికులతో సమానంగా కష్టపడ్డారు. వాళ్లతో కలిసే భోంచేసేవారు. కలిసే నిద్రపోయేవారు. అనతికాలంలోనే మిల్లులోని అన్ని విభాగాలపైనా పట్టు సాధించారు. ఆయన తమలో ఒకడిలా పనిచేయడంతో కార్మికుల్లోనూ ఉత్సాహం ఇనుమడించింది. క్రమంగా మిల్లు లాభాలబాట పట్టింది. రాయపూర్ మిల్లు అనుభవం ఉజ్వలమైన ఆయన భవితవ్యానికి పునాది వేసింది. ఆయన శ్రమ వృథా కాలేదు. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత ఉత్పత్తులకు విపరీతంగా పెరిగిన గిరాకీని అందిపుచ్చుకున్న కొద్దిమంది తొలితరం పారిశ్రామికవేత్తల్లో కస్తూర్‌బాయ్ కూడా ఉన్నారు. రాయ్‌పూర్ మిల్లుకు బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌లో ఒకరిగా 1918లో ఎన్నికయ్యారు. ఆ తర్వాత రెండేళ్లకే సొంతగా అశోకా మిల్స్‌ను స్థాపించారు. సన్నిహితుడైన దయాభాయ్ మోతీలాల్ పటేల్‌ను అశోకా మిల్స్ జనరల్ మేనేజర్‌గా నియమించుకున్నారు. దయాభాయ్ సలహాలతో సోదరులను భాగస్వాములుగా చేసుకుని, వ్యాపారాలను శరవేగంగా విస్తరించారు. 1924–38 కాలంలో నాలుగు మిల్లులను స్థాపించారు. వాటిని ఎప్పటికప్పుడు కొత్త కొత్త యంత్రాలతో ఆధునికీకరించేవారు. అప్పట్లో దేశంలోని మొత్తం స్పిన్నింగ్ పరిశ్రమలో కస్తూర్‌భాయ్ ఒక్కరిదే 12 శాతం వాటా అంటే ఆయన విస్తరణ ఏ స్థాయిలో జరిగిందో అర్థం చేసుకోవాల్సిందే! అమెరికన్ కంపెనీ ‘సైనమిడ్’ సహకారంతో 1952లో దేశంలోనే తొలిసారిగా అధునాతన అద్దకం సంస్థ ‘అతుల్ లిమిటెడ్’ను స్థాపించారు.


కొత్తకొత్తగా..
20వ పేజీలో

### స్వదేశీ ఉద్యమానికి బాసట

బ్రిటిష్ హయాంలో కస్తూర్‌భాయ్ 1923లో సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యుడిగా ఎన్నికయ్యారు. ఆ పదవిలో కొనసాగిన మూడేళ్లలోనూ దేశంలోని పరిశ్రమల అభివృద్ధికి కృషి చేశారు. గాంధీజీ 1930లో స్వదేశీ ఉద్యమాన్ని ప్రారంభించినప్పుడు ఆయనకు బాసటగా నిలిచారు. అప్పట్లో దేశం ద్రవ్యోల్బణంతో అల్లాడేది. అలాంటి పరిస్థితుల్లో పరిశ్రమలపై పన్నుల భారం తగ్గించేలా బ్రిటిష్ ప్రభుత్వంతో చర్చలు జరిపారు. ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ చాంబర్స్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీస్ అధ్యక్షుడిగా 1934లో ఎన్నికయ్యారు. మరుసటి ఏడాదే అహ్మదాబాద్ టెక్స్‌టైల్ మిల్ ఓనర్స్ అసోసియేషన్ అధ్యక్షుడిగా ఎన్నికయ్యారు. బ్రిటిష్ పాలన కొనసాగుతుండగానే 1937లో రిజర్వ్‌బ్యాంకు డైరెక్టర్‌గా నియమితుడై, ఆ పదవిలో పన్నెండేళ్లు కొనసాగారు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కూడా పలు గౌరవ పదవుల్లో కొనసాగారు. అహ్మదాబాద్‌లో ఐఐఎంతో పాటు ఇస్రో, ఫిజికల్ రీసెర్చ్ లాబొరేటరీ వంటి పలు విద్యా, పరిశోధన సంస్థలకు భూములను విరాళంగా ఇచ్చారు. అహ్మదాబాద్‌లో ఉన్నత విద్యావ్యాప్తి కోసం 1936లో అహ్మదాబాద్ ఎడ్యుకేషన్ సొసైటీని స్థాపించారు. ఇప్పుడది అహ్మదాబాద్ వర్సిటీగా రూపుదిద్దుకుంది. ఆర్థిక, విద్యా, సేవారంగాలలో కస్తూర్‌భాయ్ చేసిన విశేష కృషికి గుర్తింపుగా భారత ప్రభుత్వం ఆయనను 1969లో పద్మభూషణ్‌తో సత్కరించింది. ఆయన 1960లోనే తన వ్యాపారాలను ఇద్దరు కుమారులకు అప్పగించేసి, తర్వాతి కాలమంతా సేవారంగానికి అంకితమయ్యారు. జాతీయవాదానికి, వ్యాపార దక్షతకు, వదాన్యతకు నిలువెత్తు నిదర్శనంగా నిలిచిన కస్తూర్‌భాయ్ 1980 జనవరి 20న అహ్మదాబాద్‌లో కన్నుమూశారు.

- దండేల కృష్ణ

**కిసుక్కు**

సుబ్బారావు: మా ఆవిడ వండిన కూర చేదుగా ఉంది. దీనికి కారణం అందులో విషం కలపడమే. అందుకే విడాకులు ఇవ్వాలనుకుంటున్నాను...
జడ్జి: ఇంతకీ మీ ఆవిడ ఏ కూర వండింది?
సుబ్బారావు: కాకరకాయ

**మీకు తెలుసా?**

చైనాలో 35 కోట్ల మంది పొగతాగుతారు. ప్రపంచంలోని సిగరెట్ ఉత్పత్తుల్లో 42 శాతం చైనా నుంచే ఉత్పత్తి అవుతుంది.

• నెయిల్ ఆర్ట్

# మునివేళ్లపై! స్వర ముద్రికలు...



సంగీతంతో రాళ్లు కరిగించవచ్చు అంటారు. అలాగే స్వరతంత్రులను గోళ్లపై తీర్చిదిద్ది చూపరుల హృదయాలను రాగరంజితం చేయచ్చు. మునివేళ్లలో ఒద్దికగా ఉండే గోళ్లపైన స్వర ముద్రికలను వేయాలనుకుంటే అందుకు ఎంతో కష్టపడాల్సిన అవసరం లేదు. చాలా సులువుగా, వేళ్లు అత్యంత అందంగా కనిపించే ఈ మ్యూజికల్ డిజైన్‌ని మీరూ ట్రై చేయండి.

ఈ నెయిల్ ఆర్ట్‌కు కావాల్సింది తెలుపు, నలుపు నెయిల్ పాలిష్. దీంతో పాటు బేస్‌కోట్.

**స్టెప్ - 1**



గోళ్లు ఎలాంటి వంకరలు లేకుండా చక్కగా కత్తిరించుకోవాలి. ముందుగా బేస్ కోట్ వేయాలి. ఆరిన తర్వాత వైట్ పాలిష్ వేయాలి. ఇలా అన్ని గోళ్లకు వేశాక డిజైన్ కోసం నల్లని నెయిల్‌పాలిష్‌ను తీసుకోవాలి.

**స్టెప్ - 2**



నల్లటి నెయిల్ పాలిష్‌తో ముందు గోరు చివరలో మూడు అడ్డ గీతలు గీయాలి.

**స్టెప్ - 3**



నల్లటి నెయిల్ పాలిష్‌తో కింది లైన్ చివరలో ఒక 'డాట్' పెట్టాలి. బ్రష్‌తోనే కొద్దిగా వెడల్పు చేయాలి.

**స్టెప్ - 4**



మొదటి రెండు గీతలకు తగిలేలా మరో 'డాట్'ను పెట్టాలి. తర్వాత రెండు నిలువు లైన్లు వేసి, ఫొటోలో చూపిన విధంగా మరో అడ్డ గీతతో జత చేయాలి.

ఒక గోరు మీద అడ్డగీతతో జత చేసి, మరో వేలికి జత చేయకుండా వదిలేయాలి. దీంతో మ్యూజిక్ సింబల్స్ మీ వేలి కొనలలో అందంగా దర్శనమిస్తాయి.



• వాస్తు వీక్షణం

వాస్తు విద్వాన్, సాయిశ్రీ

గౌ॥డా॥ దంతూరి పండరీనాథ్



## పెళ్ళిచూపుల రోజున ఏమి చేస్తే మంచి ఫలితం?

పెళ్ళిచూపులు ఉన్న రోజున ఆ అమ్మాయి /అబ్బాయి కొన్ని విధులను ఆచరించటం వలన పెళ్ళి చూపుల ఫలితం అనుకూలంగా వచ్చే అవకాశా లుంటాయి. ఉదయం ప్రసన్నంగా నిద్రలేవటం, పచ్చని చెట్లను, మొక్కలను ప్రసన్నంగా చూడటం. ఇంటికి ఈశాన్యంలో (ఖాళీ స్థలము / బాల్కనీ) రెండు చెంబుల నీళ్ళు తూర్పు ముఖంగా పారబోయటం ఇవన్నీ కూడా ప్రతి రోజు మంచి ఫలితాలనిచ్చే చిన్న చిన్న ప్రక్రియలు. ముఖ్యమైన పనులున్న రోజులలో పైన చెప్పిన ప్రక్రియలు తప్పకుండా చేస్తూ ఉండాలి. మంచి ఫలితాలను అనుభవ పూర్వకంగా ఎవరికి వారే తెలుసుకోగలుగుతారు. ఏదో గొప్ప లాభం వస్తుందనుకొని పెద్ద మొత్తంలో పెట్టుబడి పెట్టే రోజుల్లో కూడా పై చెప్పిన ప్రక్రియలు చేయటం వలన మంచి ఫలితం వస్తుంది. ఒకవేళ ఏవైనా కారణంల చేత ఆ వ్యాపారంలో భాగస్వామి అయే అవకాశం తప్పిపోయినా, ఆ పెద్దమొత్తం పెట్టుబడిగా వినియోగించ లేకపోయినా.... అది మంచికే జరిగిందని, ఆ ధనాన్ని పెట్టుబడిగా పెట్టకపోవటమే మంచిది అయిందని తరువాత తెలుస్తుంది. జీవితంలో ముఖ్యమైన సందర్భాలలో పెళ్ళిచూపులు సందర్భం కూడా ఒకటి. ఆ రోజున ఆ అమ్మాయి / అబ్బాయి కాని వారి ఇంటి యందు ఆగ్నేయ మూలన తుర్పునకు అభిముఖంగా కూర్చోనికాని నిలబడిగాని పాలు ఉన్న గిన్నెను స్టౌమీద పెట్టి, స్టౌవెలిగించాలి. పాలుపొంగే వరకు చూడాలి. ఆ పాలతో టీ, కాఫీ ఏదైన చేసుకొని తాగాలి. ఆ పాలతోనే ఏదైన తీపి వంట చేసి పూజ చేసుకునే చోట హారతితో నైవేద్య సమర్పణ చేయాలి. ప్రసాదంగా తీసుకోవాలి. మీరు చేయవలసింది ఇంతే! మంచి ఫలితాలు వాటంతటఅవే వస్తాయి.

## మీరు మా ఇంటికి వచ్చి వాస్తు చూసారు

రెండేళ్ళ క్రితం మా ఆహ్వానం మేరకు మీరు మా ఇంటికి వచ్చి వాస్తు చూసారు. మా సమస్యలన్నీ విన్నారు. ఇంట్లో ఉన్న ఒక బాత్‌రూమ్ తలుపును మీరు చెప్పిన విధంగా మార్చుకున్నాము. కొన్ని ప్రత్యామ్నాయా ప్రక్రియలు మీరు చెప్పివిధంగా పాటిస్తున్నాం. ఇప్పుడు చాలా బాగుంది. అప్పటి పరిస్థితులు మాత్రం చాలా ఘోరంగా ఉండేవి. వాస్తు దోషాలను సవరించుకోవటం వలన ఇంత మంచి ఫలితాలుంటాయని అనుకోలేదు. కృతజ్ఞతలు.

– సరోజ, హైదరాబాద్.

వాస్తు దోషాల వలన వచ్చే ఎటువంటి దారుణమైన చెడు ఫలితాలైన సరే, ఆ వాస్తు దోషాలను సవరించుక్న్న తరువాత తప్పకుండా క్రమంగా కనుమరుగవుతాయి. ఒక ఇంటికి ఎన్నోవాస్తు దోషాలుండ వచ్చును. కాని ప్రత్యేకంగా ఏ వాస్తు దోషము చేత ఆ ఇంట్లో ఉండే వాళ్ళు ఎక్కువ పీడింపబడుతున్నారో తెలుసుకొని, ఆ వాస్తు దోషాన్ని సవరించటం (ఒక సర్జన్ లాగ) ఎంతో నైపుణ్యంతో కూడుకున్నటువంటి పని. మీరు కూడా మా సలహాలను తేలికగా తీసుకోకుండా పాటించారు. కాబట్టి మంచి ఫలితాలను పొందగలుగు తున్నారు. భగవదనుగ్రహము చేతను గృహనుగ్రహము చేతను ముందు ముందు మీరు మీ పిల్లలు కూడా మంచి ఫలితాలను పొందుతూ వర్ధిల్లాలి. సాయిరాం!





# రావత్... వెండితెర రావణ్!

కొన్ని సంఘటనలు 'చిత్రం'గా జరుగుతాయి. సూచనప్రాయంగా కూడా చెప్పకుండా జరుగుతాయి.

'ప్రదీప్ రావత్ ఎవరు?' అంటే బాలీవుడ్ ప్రేక్షకులు కాస్తో కూస్తో ఆలోచించవచ్చు గానీ...మన తెలుగు వాళ్లు మాత్రం టక్కీమని చెబుతారు. వీలైతే అతని డైలాగును ఒకసారి ఇలా గుర్తుతెచ్చుకుంటారు.

'ఒక్క
ముక్క చెప్పి ఉండాలి.
చెప్పలే.
అంటే...లెక్కలే!
నేనంటే లెక్కలేని వాన్ని
నా లెక్కలో ఉంచడం ఇష్టం లేదు'

•••

రాజమౌళి 'సై' సినిమాకు ఒక విలన్ కావాలి. ఆషామాషీ విలన్ కాదు. గట్టి విలన్ కావాలి.

సినిమా విజయానికి విలనే కీలకం!

అందుకే రాజమౌళి విలన్‌ల వేటలో ఉన్నాడు. ఎందరినో... స్క్రీన్‌టెస్ట్, అడిషన్ టెస్టులు చేస్తున్నాడు. కానీ ఎవరూ నచ్చడం లేదు. దీంతో 'నాకో మాంచి విలన్ కావాలి' అంటూ తన అసిస్టెంట్‌ను ముంబైకి పంపించాడు. ఆ అసిస్టెంట్ ఎక్కడెక్కడ తిరిగాడోగానీ ఆరోజు అమీర్‌ఖాన్ 'లగాన్' సినిమా చూద్దామని డిసైడైపోయాడు.

అతను అలా డిసైడై ఉండకపోతే....ప్రదీప్ రావత్ ఎవరో మనకు తెలిసి ఉండేది కాదు. మనకు ఒక ఉత్తమ విలన్ తెర మీద పరిచయమయ్యేవాడు కాదు!

'లగాన్' సినిమాకు కృతజ్ఞతలు.

'లగాన్'లో దేవా అనే సర్దార్ పాత్ర పోషించాడు రావత్.

మధ్యప్రదేశ్‌లోని జబల్పూర్ పట్టణంలోని యు.సి.ఒ. బ్యాంకులో కొంత కాలం పని చేసిన ప్రదీప్ రామ్‌సింగ్ రావత్ 'మహాభారత్' టీవీ సీరియల్‌లో అశ్వత్థామ పాత్రతో నటుడిగా పరిచయమయ్యాడు. ఆ తరువాత 'యుగ్' టీవీ సీరియల్‌లో బ్రిటీష్ ఇన్‌స్పెక్టర్‌గా, 'సర్ఫరోష్' సినిమాలో 'సుల్తాన్'గా నటించాడు. మళ్లీ 'లగాన్' దగ్గరకు వద్దాం.

'లగాన్'లో దేవా దూకుడు రాజమౌళి అసిస్టెంట్‌కు బాగా నచ్చింది. 'నేను వెదుకుతున్న విలన్ ఇతడే' అనుకున్నాడు. రావత్‌ను సంప్రదించాడు. సౌత్ సినిమాలలో నటించడానికి విముఖంగా లేడుగానీ తనలో చిన్న సందేహం... ''నాకు తెలుగు ఒక్క ముక్క కూడా రాదు. భాష రాకపోతే బొమ్మలా నటించాల్సిందే...''

అయితే ఈ సందేహాన్ని పక్కన పెట్టి అడిషన్ టెస్ట్‌కు హాజరయ్యాడు. ఓకే అనిపించుకున్నాడు. అలా తెలుగు వెండితెరపై బిక్షు యాదవ్‌గా అలరించాడు.

నోటిలో పెద్ద చుట్ట.
ముక్కుకు రింగు.
కాటుక కళ్లు.
పే...ద్ద మీసాలు.

నాలుక మడతెట్టి వార్నింగ్ ఇచ్చే మ్యానరిజం... చూసీ చూడగానే తెలుగు ప్రేక్షకలోకానికి చేరవయ్యాడు రావత్.

ఆ తరువాత...

'భద్ర'లో వీరయ్య, 'అందరివాడు'లో సత్తి బిహారి, 'ఛత్రపతి'లో రాస్ బిహారి, 'దేశముదురు'లో తంబిదురై, 'యోగి'లో నరసింహ పహిల్వాన్, 'జగడం'లో మాణిక్యం... ఇలా ఎన్నో పేర్లతో ఉత్తమ విలన్‌గా స్థిరపడ్డాడు రావత్.

ఇక 'గజినీ' సినిమాలో రావత్ చెడ్డ విలనిజానికి మంచి పేరు వచ్చింది. రామ్-లక్ష్మణ్‌గా సౌత్‌లో, ధర్మాత్మగా నార్త్‌లో ఆయన విలనిజానికి బోలెడు 'చెడ్డ' పేరు వచ్చింది.

''బాలీవుడ్ సినిమాలలో ఎక్కువగా నటించకపోవడానికి కారణం ఏమిటి?'' అనే ప్రశ్నకు-

''అవకాశాలు రాకపోవడమే'' అని చెప్పే రావత్ తనకు అవకాశం ఇచ్చిన తెలుగు, తమిళ, మలయాళ చిత్రాల్లో 'ఉత్తమ విలన్'గా గట్టి పేరు సంపాదించుకున్నాడు.

•••

'లగాన్'లో దేవ పాత్ర ముఖేష్ రుషి చేయాల్సింది. అయితే డేట్స్ సమస్య వల్ల ఆ పాత్రను ముఖేష్ వదులుకోవాల్సి వచ్చింది. ఆ అవకాశం రావత్‌కు వచ్చింది.

'లగాన్'లో సర్దార్జీ పాత్ర ముఖేష్ చేసి ఉంటే....రావత్ 'లగాన్'లో నటించేవాడు కాదు. 'లగాన్'లో నటించకపోతే...రాజమౌళి దృష్టిలో పడి ఉండేవాడు కాదు. రాజమౌళి దృష్టిలో పడి ఉండకపోతే... సౌత్‌లో స్టార్ విలన్‌గా పేరుతెచ్చుకొని ఉండేవాడు కాదు... ఎంత చిత్రం!



సిగసింగారం
22వ పేజీలో

## • హెల్త్‌కార్నర్

**1** త్రిఫలాలలో ఒకటిగా ఆయుర్వేదం గుర్తించిన కరక్కాయలో చాలా ఔషధ గుణాలు ఉన్నాయి. తరచు పొడి దగ్గుతో బాధపడే వారు కరక్కాయ పొడిని తేనెలో కలిపి తీసుకుంటే దగ్గు అదుపులోకి వస్తుంది. కరక్కాయ పొడిని గోరువెచ్చని నీటిలో కలుపుకొని ఆ నీటిని తాగితే వాంతులు అరికడతాయి.



**2** బెండకాయలు తింటే తెలివితేటలు పెరుగుతాయనే నమ్మకం చాలామందికి ఉంది. నమ్మకం సంగతి అలా ఉంచితే, బెండకాయల్లో పుష్కలంగా యాంటీ ఆక్సిడెంట్లు కొలెస్ట్రాల్‌ను తగ్గిస్తాయని తాజా పరిశోధనల్లో తేలింది. బెండకాయల్లోని గింజలను ఎండబెట్టి, పొడిగా చేసుకుని, ఆ పొడిని తిన్నట్లయితే మధుమేహం అదుపులోకి వస్తుంది.



**3** జుట్టురాలడం ఎవరికైనా ఇబ్బందికరమైన సమస్యే. ఈ సమస్యను అధిగమించాలంటే ఇంట్లోనే చేసుకోగల చిన్నపాటి చిట్కా ఉంది. తాజా మెంతి ఆకులను శుభ్రంగా కడిగి, రుబ్బుకుని, ఆ ముద్దకు రెండు చెంచాల నిమ్మరసం కలిపి తలకు పట్టించి, అరగంట ఆగి తలంటుకోవాలి. ఇలా తరచు చేస్తే జుట్టురాలడం తగ్గుతుంది.



**4** ఎప్పుడైనా జిహ్వాచాపల్యం ఆపుకోలేక కొవ్వు పదార్థాలు ఎక్కువగా ఉన్న ఆహారం తిన్నట్లయితే, అట్టే బెంబేలెత్తిపోకండి. అలా అదనంగా కొవ్వుపదార్థాలు గల ఆహారం తీసుకున్న రోజున ఒక కప్పు ద్రాక్షపళ్లు తినండి. శుభ్రంగా కొవ్వు కరిగి పోతుంది. ద్రాక్షల్లోని యాంటీ ఆక్సిడెంట్లు కొవ్వులను కరిగించడంలో కీలక పాత్ర పోషిస్తాయి.



**5** కొలోన్ కేన్సర్, డయాబెటిస్ వంటివి ఇటీవలి కాలంలో ఎక్కువ మందిని పీడిస్తున్నాయి. వీటి బారిన పడకుండా ఉండాలంటే ఆహారంలో పాలిష్ చేసిన తెల్లబియ్యం బదులు, ముడిబియ్యం ఉపయోగించడం మంచిది. ముడిబియ్యంలో పుష్కలంగా లభించే సెలీనియం, పీచు పదార్థాల వల్ల కొలోన్ కేన్సర్ ముప్పు గణనీయంగా తగ్గుతుంది.



# నో ఫ్రెండ్స్ ఈజ్ ఈక్వల్ టు స్మోకింగ్!

జీవితంలో ఫ్రెండ్స్ లేకపోవడం అన్నది పొగతాగే అలవాటు అంతటి ప్రమాదకరం అంటున్నారు పరిశోధకులు. ఒంటరి జీవితానికీ ఫైబ్రినోజెన్ అనే రక్తాన్ని గడ్డకట్టించడానికి ఉపయోగపడే ప్రొటీన్‌కు సంబంధం ఉంటుందంటున్నారు హార్వర్డ్ యూనివర్సిటీకి చెందిన నిపుణులు. ఒంటరి జీవితాన్ని గడిపేవాళ్లలో ఫైబ్రినోజెన్ తగ్గుతుంది. దాంతో జీవితంలో ఒత్తిళ్లు ఏర్పడినప్పుడు 'ఫైట్ లేదా ఫ్లైట్' ఎదుర్కోవడం లేదా పారిపోవడం జరిగినప్పుడు రక్తస్రావం అతిగా జరగకుండా రక్తం గడ్డకట్టడానికి నిరోధించడానికి ఉపయోగపడేదే ఈ ఫైబ్రినోజెన్. అయితే మరీ ఫ్రెండ్స్ ఎక్కువగా పెరిగినా అది ఈ ఫైబ్రినోజెన్‌ను మరింత పెరిగేలా చూస్తుంది.



దాంతో రక్తంలోని గడ్డకట్టే అంశాలూ పెరిగి రక్తనాళాల్లో పూడికలూ అడ్డంకులూ రావచ్చంటున్నారు నిపుణులు. సోషల్‌నెట్‌వర్క్ ద్వారా అతిగా ఫ్రెండ్స్‌ను రూపొందించుకునే వారిలోనూ ఫైబ్రినోజెన్ పెరిగి అది గుండె జబ్బులంత ప్రమాదకరంగా మారవచ్చనంటున్నారు. అందుకే ఆరోగ్యకరమైన ఫ్రెండ్స్, ఆరోగ్యకరమైన రీతిలో ఫ్రెండ్‌షిప్ ఉండాలంటున్నారు హార్వర్డ్ మెడికల్ స్కూల్‌కు చెందిన నిపుణులు డాక్టర్ డేవిడ్ కిమ్.

# ఊదే వాద్యాలతో జాగ్రత్త!

నోటితో ఊదే సంగీత వాద్యాన్ని ప్లే చేస్తుంటారా? అది శుభ్రంగా ఉందా లేదా అన్నది చూసుకుంటూ కాస్త జాగ్రత్తగా ఉండాలంటున్నారు సౌత్ మాంచెస్టర్‌లోని యూనివర్సిటీ హాస్పిటల్‌కు చెందిన పరిశోధకులు డాక్టర్ జెన్నికింగ్. ఆయన పరిశోదనల్లో బ్యాగ్‌పైప్, ట్రంపెట్ లాంటి వాద్యాలను వాయించేవారికి 'హైపర్‌టెన్సివ్ నిమోనైటిస్' (హెచ్‌ఎన్) అనే వ్యాధి వచ్చే అవకాశాలు ఎక్కువ అని తేలింది. అయితే హెచ్‌ఎన్‌కు చికిత్స అందుబాటులో ఉంది. కాబట్టి ఆందోళన పడాల్సిన అవసరం లేదు. కానీ చికిత్స కంటే నివారణ మేలు కాబట్టే ఈ హెచ్చరికలు చేస్తున్నారు నిపుణులు.



# ఇనుము ఇంజెక్షన్‌తో మటుమాయం పార్కిన్‌సన్!

ఇనుమును అయస్కాంతం ఆకర్షిస్తుంది. మెదడులోకి అత్యంత సూక్ష్మమైన ఇనుమును ఇంజెక్షన్ రూపంలో ప్రవేశపెడితే...! బయటి నుంచి అయస్కాంతాలతో మెదడులోని ఇనుమును ఆకర్షిస్తే!! అలా ఆకర్షిస్తూ చచ్చుబడిన మెదడు మార్గాల్లో ఆ ఇనుము ప్రవహించేలా చూస్తే!!!

ఒక అద్భుతమైన ఆలోచన. సైన్స్ ఫిక్షన్‌లా అనిపించేలా ఉందా యోచన.

పార్కిన్‌సన్స్ వ్యాధిగ్రస్తులను చూశారు కదా... తమ చేతులపైనా తమ చేతలపైనా నియంత్రణ ఉండదు. వణుకుతుంటారు. చేతితో మూతి తుడుచుకోవాలంటే తమపై తమకే విసుగు వచ్చేలా సహకరించని కదలికలు. దుర్భరం ఆ వ్యాధి. అలాంటి వ్యాధిగ్రస్తులకు మేలు చేసేందుకు ఏం చేయాలా అని యోచిస్తున్నారు సైంటిస్టులు. ఇనుమును మెదడులోకి పంపించి అయస్కాంతంతో వాటిని ఆకర్షించి నిస్తేజమైన భాగాలను ఉత్తేజితం చేయడమనే యోచన వచ్చింది. ఇనుమును మెదడులోకి ప్రవేశపెట్టి ఆ ఇనుమును మాగ్నెట్ల సహాయంతో ఆకర్షించాలన్నది శాస్త్రజ్ఞుల ఆలోచన. ఈ మార్గం ద్వారా కేవలం ఒక సూదిమందు ద్వారానే ఎలాంటి సర్జరీ అవసరం లేకుండానే పార్కిన్‌సన్స్ వ్యాధిగ్రస్తులకు నయం చేయవచ్చని యూనివర్సిటీ ఆఫ్ లండన్‌కు చెందిన పరిశోధకులు యోచిస్తున్నారు.

ఎలకలపై చేసిన తొలి ట్రయల్స్‌లో మెదడులోని కొన్ని ప్రాంతాలను (సెంటర్స్‌ను) బయట నుంచి ఇలా నియంత్రించవచ్చని తెలుస్తోంది. యూనివర్సిటీ ఆఫ్ లండన్‌కు చెందిన ప్రొఫెసర్ మార్క్ లిథ్‌గోయ్ ఎలుకలపై చేసిన అధ్యయనాలను వివరించారు. ''ఇంకా ఈ విషయంలో పూర్తి స్పష్టత లేదు. కానీ ఫలితాలు ఆశావహంగానే కనిపిస్తున్నాయి. ఎలుకలకు ఇంజెక్షన్ ఇచ్చాక... వాటి నాడీ కణాల్లో దాదాపు 2000 పునరుజ్జీవితమయ్యాయి. ఇదే మార్గం మానవులకు ఎందుకు వర్తింపజేయలేం అనే ఆలోచన వచ్చింది. మానవ మెదడుకు సైతం ఇనుము ఉన్న ఒక ఇంజెక్షన్ ఇచ్చి తలపై హెల్మెట్ లాంటిది అమర్చాలి. ఆ హెల్మెట్‌లో కొన్ని చోట్ల అయస్కాంతాలు (మాగ్నెట్స్) ఉంటాయి. అవి వివిధ దిశల్లో ఇనుము ప్రవహించేలా లోపల ఉన్న ఇనుమును ఆకర్షిస్తుంటాయి. దాంతో ఆ ఇనుము నిస్తేజమైన మెదడు ప్రాంతాల్లోని నాడీ కణాల మార్గాల్లో నడుస్తుంటుంది. ఫలితంగా చచ్చుబడిన నాడీ కణాలూ తిరిగి ఉత్తేజితమవుతాయి'' అంటూ వివరించారు ప్రొఫెసర్ మార్క్ లిథ్‌గోయ్. ప్రస్తుతానికి ఈ టెక్నిక్‌ను 'డీప్ బ్రెయిన్ స్టిమ్యులేషన్' అని పిస్తున్నారు.

''బయట నుంచి కరెంట్ ఇవ్వడం మామూలుగా చేసే పనే. కానీ మెదడులోనే ఎలక్ట్రోడులను ఏర్పాటు చేసి, అంతర్గతంగానే కరెంట్ చికిత్స చేయడం అన్నది 'డీప్ బ్రెయిన్ స్టిమ్యులేషన్' ప్రక్రియలో ఉన్న వైవిధ్యభరితమైన ఆలోచన. ఇది విజయవంతం అయితే అసలు చిన్న కోత కూడా పెట్టకుండా ఒక మేజర్ సర్జరీలోని ప్రయోజనాలు పొందడమే'' అంటున్నారు లండన్‌కు చెందిన పార్కిన్‌సన్స్ వ్యాధిని నయం చేసే నిపుణులు.



కేవలం పార్కిన్‌సన్స్ వ్యాధిగ్రస్తులకే కాదు... ఒకవేళ ఈ యోచన విజయవంతమైతే, అది మరెన్నో మెదడుకు సంబంధించిన వ్యాధుల చికిత్సకు మార్గదర్శకం కాగలదని సైంటిస్టులు ఆలోచిస్తున్నారు. భవిష్యత్తులో మూర్ఛ (ఎపిలెప్సీ), డిప్రెషన్ వంటి వ్యాధుల్లో సైతం ఈ ఆలోచన పనిచేస్తుందని నిపుణుల భావన.

● టూర్‌దర్శన్

# మూడు తొండాల గణేశుడు

జై జై గణేశా... మూడు తొండాల గణేశా... జయములిమ్ము బొజ్జ గణేశా..

వినాయకుడి ఆలయాల్లో సాధారణంగా ఒక తల, ఒక తొండం, నాలుగు చేతులతో స్వామి కనిపిస్తాడు. అదే, పుణేలోని సోమ్వార్‌లేన్‌లో గల త్రిశుండ్ మయూరేశ్వర మందిరానికి వెళితే మూడు తొండాలు, ఆరు చేతులతో నెమలి వాహనంపై ఆశీనుడైన గణేశుడు మనకు దర్శనమిస్తాడు. జీవితంలో విజయావకాశాలు అందుకోవాలని తపించే భక్తులకు అభయముద్రలో ఆశీస్సులు అందిస్తుంటాడు.

మహారాష్ట్రలోని పుణే పట్టణంలోని రైల్వేస్టేషన్‌కి కేవలం 2 కిలోమీటర్ల దూరంలో ఉంటుంది. చిన్నదే అయినా ఎంతో చారిత్రక నేపథ్యంతో పాటు అతి ప్రాచీన ఆలయంగా త్రిశుండ్ మయూరేశ్వర గణపతి మందిరానికి ఘనమైన పేరుంది. దీర్ఘచతురస్రాకారంలో నిటారుగా ఉండే నల్లని రాతి గోడలతో ఈ ఆలయం అలరారుతుంటుంది. రాజస్థానీ, మాల్వా, దక్షిణ భారతీయ శైలులకు చెందిన శిల్పకళతో ఈ మందిరం ఆకట్టుకుంటుంది. రాతి గొడలపై నెమళ్లు, చిలకలు, ఏనుగులు, ఖడ్గమృగాలు, రక్షకభటుల బొమ్మలు, పురాణగాథల శిల్పాలు అత్యంత సహజంగా కనిపిస్తుంటాయి.

### గణనాథుడి ద్వారపాలకులు...

అత్యంత ఆకర్షణీయంగా కనిపించే ఈ దేవాలయాన్ని 1754లో భీమ్‌జిగిరి గోసవి అనే స్థానికుడు కట్టించాడని ప్రతీతి. నల్లటి పెద్ద పెద్ద రాళ్లను ఈ నిర్మాణానికి ఉపయోగించారు. ఎక్కడా మట్టిగానీ, కాంక్రీట్ కానీ కనిపించని ఈ ఆలయాన్ని పూర్తి రాతిమయంగానే రూపొందించారు. రాళ్ల మీదనే చెక్కిన అపురూపమైన కుడ్యాలలో ఆలయ మహాద్వారంపైన మధ్యలో గజలక్ష్మి ఆసీనురాలై ఉంటుంది. ఆ పైన ప్రసన్నవదనంతో అనుగ్రహిస్తున్నట్లు కనిపించే వినాయక విగ్రహం ఇట్టే ఆకర్షిస్తుంది. కుంకుమపువ్వు రంగులో కనిపించే మరో చిట్టి గణపతి ద్వారం మీదుగా ఉంటుంది. ద్వారం గుండా నేరుగా గర్భగుడిలో స్వామి దర్శించుకోవచ్చు. ఈ ఆలయ నిర్మాణం పూర్తవడానికి పదహారేళ్లు ఎట్టింది. 1770లో ఏకశిలతో చెక్కబడిన మూడు తొండాలు గల గణపతిని ఈ ఆలయంలో ప్రతిష్టించారు.

### సిందూర రూపుడై...

గర్భగుడిలో కనిపించే గణపతి సిందూరాన్ని నిలువెల్లా పులుముకొని, ప్రత్యేకంగా కనిపిస్తాడు. మూడు తొండాలు (త్రి-శుండ్), ఆరు చేతులతో, నెమలి వాహనం (సాధారణంగా ఎలుక వాహనంగా ఉంటుంది) మీద ఆసీనుడై ఉండే స్వామి దర్శన భాగ్యం చేతనే భక్తుల కోరికలు నెరవేరుతాయని, ఎటువంటి క్లిష్టమైన పనినైనా విజయవంతంగా పూర్తిచేయవచ్చు అనే నమ్మకం ఇక్కడి భక్తులలో ఉంది.

### నాటి శాసనాలే ఆధారాలు...

గర్భగృహం లోపలి రాతి గోడలను పరిశీలిస్తే అబ్బురపరచే శిల్పకళాకృతి కళ్లకు కడుతుంది. ఇక్కడి గర్భగుడి గోడల మీద మూడు శాసనాలు చెక్కి ఉన్నాయి. రెండు శాసనాలు దేవనాగరి లిపి, మూడోది పర్షియన్ లిపిలో ఉంది. దేవనాగరి లిపిలో ఉండే రెండు శాసనాలలో ఒకదానిమీద రామేశ్వర ఆలయ స్థాపన, రెండవది సంస్కృత శాసనంలో భగవద్గీతశ్లోకాలను చెక్కారు. మూడవ శాసనం పర్షియన్ భాషలో ఉండగా, అది ఈ దేవాలయ చరిత్రను తెలియజేస్తోంది.

**ఎలా వెళ్లాలి?**

- హైదరాబాద్ నుంచి పుణేకి బస్సు, రైలు సదుపాయా లున్నాయి. పుణే జంక్షన్ రైల్వే స్టేషన్ నుంచి సోమ్వార్‌పేట్‌కి 2 కి.మీ దూరం.
- పుణేలో విమానాశ్రయం ఉంది. ఇక్కడ నుంచి సోమ్వార్‌పేట్‌కి 10 కిలోమీటర్లు.
- అన్ని హోటల్ వసతి సదుపాయాలు ఉన్నాయి.

త్రిశుండ్ మయూరేశ్వర్ గణపతి మందిరానికి సమీపంలో 8వ శతాబ్దికి చెందిన పాటలేశ్వర గుహలు ఉన్నాయి. ఇవి రాష్ట్రకూటుల కాలానికి చెందినవి. ఇక్కడి గుహలలో దేవాలయాలూ ఉన్నాయి.



పాటలేశ్వర గుహలు

లాల్‌మహల్ ఇక్కడ తప్పక చూడవలసింది. ఛత్రపతి శివాజీ తండ్రి షహాజీ భోంస్లే 1630లో లాల్ మహల్‌ని నిర్మింపజేశాడు. ఆయన భార్య జిజియాబాయి, కుమారుడితో సహా ఈ లాల్‌మాల్‌లో నివసించేవారు. దీనిని పునరుద్ధరించి మ్యూజియమ్‌గా మార్చి పర్యాటకుల సందర్శనం కోసం ఉంచారు.



లాల్‌మహాల్

శనివార్‌వాడలో గల కస్బా గణపతి ఆలయం అతి ప్రాచీనమైనది. స్వాతంత్ర్యోద్యమ కాలంలో బాల్ గంగాధర్ తిలక్ ఆధ్వర్యంలో మొట్టమొదటిసారి ఇక్కడ గణపతి నవరాత్రి ఉత్సవాలు ఘనంగా ప్రారంభించారు. అదే సంప్రదాయం నేటికీ కొనసాగుతుంది.



కస్బా గణపతి ఆలయం



● కొత్తకొత్తగా

# ఎండలో తిరిగొస్తే వంట రెడీ!




ఎండలో తిరిగొస్తే కళ్లు తిరుగుతాయేమోగాని, ఎక్కడైనా వంట రెడీ అవుతుందా? అని ఆశ్చర్యపడిపోకండి. ఉదయం నడకకు వెళ్లి రావాలని ఉంటుంది. ఇంటికి రాగానే వంట రెడీ కావాలని కూడా ఉంటుంది? వంటతోనే గంట గడిపేయాలా? మార్నింగ్ వాక్‌లో బయటే ఎక్కడైనా బ్రేక్‌ఫాస్ట్ లాగించేయాలా? అనే డైలమాతో ఇక సతమతం కానక్కర్లేదు. ఇక్కడ కనిపిస్తున్న 'గో సన్' సోలార్‌స్టవ్‌ను చేత పట్టుకుని, ఉదయపు ఎండలో అలా నడిచొస్తే చాలు... ఇంటికి చేరుకునే సమయానికి వేడివేడిగా వంట రెడీ అయిపోతుంది. పైన సోలార్ ప్యానెల్‌తో నిర్మించిన బాడీ, లోపల వంటకు కావలసిన పదార్థాలు పెట్టుకునే అరలు దీని ప్రత్యేకత. కావలసిన పదార్థాలను అరల్లో సర్దేసి, కవర్ మూసేసి, హ్యాండిల్ పట్టుకుని ఎక్కడికైనా మోసుకుపోవచ్చు. మోసుకెళ్లాలని లేదనుకోండి... ఆరుబయట కాస్త ఎండసోకే చోట దీనిని అలా ఉంచినా చాలు. వంట రెడీ అయిపోతోంది. పగటి ఎండ ద్వారా ఇందులో నిక్షిప్తమైన రాత్రివేళ వంటకు కూడా సరిపోతుంది.

## ఈ చాకు తాకితేనా..!

కూరగాయలు తరగడానికి, బ్రెడ్ మీద వెన్న లేదా జామ్ రాయడానికి వాడే చాకులో విశేషం ఏముంటుంది..? ఇది మామూలు వంటింటి వస్తువే కదా అనుకుంటున్నారా..? ఇదిగో ఇక్కడ ఫొటోలో కనిపిస్తున్నది అలాంటి లాంటి చాకు కాదు. ఈ చాకు తాకితేనా..! అప్పుడే ఫ్రిజ్‌లోంచి తీసిన గడ్డకట్టిన వెన్న సైతం ఇరవై సెకన్లలో చప్పున కరిగిపోవాల్సిందే! దీనికి కరెంటు గిరెంటు ఏమైనా ఉంటుందా..? దీనికి బ్యాటరీ పెట్టుకోవాలా..? అని ఆలోచిస్తున్నారా..? అబ్బే! అలాంటివేవీ అక్కర్లేదు. మన బాడీ టెంపరేచర్‌తోనే ఇది క్షణాల్లో వెచ్చబడిపోతుంది. వెన్న మెత్తగా కరిగిపోవడానికి ఆ మాత్రం వేడి చాలదూ! కొందరు ఔత్సాహిక పరిశోధకులు రాగితో తయారైన మిశ్రమ లోహంతో 'స్ప్రెడ్‌దట్' పేరిట ఈ చాకును రూపొందించారు. వేడి ఎప్పుడూ తక్కువ ఉష్ణోగ్రత ఉన్న వైపే ప్రయాణిస్తుందనే సూత్రం ఆధారంగా తయారు చేసిన ఈ చాకు ఇప్పుడు క్రౌడ్ ఫండింగ్ వెబ్‌సైట్ 'కిక్‌స్టార్టర్' పేజీ ద్వారా ఆన్‌లైన్‌లో హాట్‌కేకులా మారింది. అయితే, ఈ చాకు బ్రెడ్‌పై వెన్న, జామ్‌వంటివి రాయడానికి మాత్రమే ఉపయోగపడుతుంది. దీని అంచులు పదునుగా ఉండవు కాబట్టి కూరగాయలు తరగడానికి పనికిరాదు. దీనిని చిన్నపిల్లలు వాడినా ప్రమాదాలు జరిగే అవకాశాలు ఉండవని తయారీదారులు చెబుతున్నారు.






## ఈ 'ముక్కు' ముందే చెప్పొచ్చుగా..!




ఇక్కడ ఫొటోలో కనిపిస్తున్న పరికరం గురించి తెలుసుకుంటే... ఈ 'ముక్కు' ముందే చెప్పొచ్చుగా..! అని మీరు తప్పక అంటారు. ఒక్క ముక్కలో చెప్పాలంటే ఇది 'ఈ–ముక్కు'. అంటే ఎలక్ట్రానిక్ ముక్కు అన్నమాట. ఎలాంటి వాసనలనైనా పసిగట్టేసే ఈ ముక్కు వంటింట్లో చాలా ఉపయోగకరంగా ఉంటుంది. ఎలాగంటారా? దీనికి వాసన చూపిస్తే చాలు... ఆహార పదార్థాలు తాజాగా ఉన్నాయో, చెడిపోయాయో ఇట్టే క్షణాల్లో చెప్పేస్తుంది. స్మార్ట్‌ఫోన్ యాప్ ఆధారంగా ఇది పనిచేస్తుంది. ఎలాంటి ఆహార పదార్థాన్ని దీనికి వాసన చూపించినా, అది తినడానికి పనికొస్తుందో, లేదో క్షణాల్లోనే స్మార్ట్‌ఫోన్‌కు సమాచారం పంపేస్తుంది. ఆ పదార్థాల నుంచి వెలువడే వాయువుల్లోని రసాయనాలు, వాటిలోని తేమ, వాటి ఉష్ణోగ్రత వంటి వివరాలన్నీ కచ్చితంగా చెప్పేస్తుంది. 'ఫుడ్ స్నిఫర్' పేరిట ఈ పరికరాన్ని లిథువేనియన్ పరిశోధకుడు అగస్టాస్ అలేసియునాస్ రూపొందించారు. మార్కెట్‌లోకి విడుదలైన కొద్దిరోజుల్లోనే ఇది ఆన్‌లైన్ సంచలనంగా మారింది.



## రెయిన్‌బో వెజ్జీ పిన్‌వీల్స్

**కావల్సినవి:** పలచగా చేసిన పచ్చని చపాతీలు – 4 (పాలకూర ఉడికించిన నీళ్లలో కొద్దిగా ఉప్పు చేర్చి, గోధుమపిండిలో కలిపి రొట్టెలు తయారుచేసుకోవాలి); ఛీజ్ తురుము – పావు కప్పు;రాంచ్ పొడి (4 మిరియాలు, అర టీ స్పూన్ తులసి పొడి, ఉల్లి-వెల్లుల్లి పొడులు – టేబుల్ స్పూన్ కలిపి చేసినది); ఎర్రని బెంగుళూరు మిర్చి – సగం ముక్క (పొడవుగా సన్నని ముక్కలుగా తరగాలి); పసుపు బెంగుళూరు మిర్చి – సగం ముక్క (పొడవుగా సన్నని ముక్కలుగా తరగాలి); క్యారెట్ ముక్కలు (నిలువుగా సన్నని ముక్కలు చేయాలి)– అర కప్పు; లేత పాలకూర ఆకులు – అర కప్పు; పర్పుల్ క్యాబేజీ తరుగు – అర కప్పు; ఉడికించిన చికెన్ తరుగు – కప్పు

**తయారీ:** ● ఒక గిన్నెలో ఛీజ్, రాంచ్ పొడి కలపాలి ● ఈ మిశ్రమం చపాతీలకు లోపలి వైపుగా రాయాలి. మరీ చివరల వరకు కాకుండా అర అంగుళం లోపలి వైపుగా రాయాలి ● ఒక్కో చపాతీకి 2 టేబుల్ స్పూన్ల చొప్పున కూరగాయల ముక్కలను వేయాలి. వాటి మీదుగా చికెన్ తురుము చల్లాలి ● ఒక్కో చపాతీని రోల్ చేయాలి ● చివరలను గట్టిగా పట్టుకొని కత్తితో చిన్న చిన్న ముక్కలుగా కట్ చేసి అందంగా అలంకరించి, అందించాలి.



## బైట్స్ లెమన్ కోకోనట్

**కావల్సినవి:** పచ్చి కొబ్బరి తురుము – 2 కప్పులు; బాదం పప్పులు – అర కప్పు; తేనె – 2-3 టేబుల్ స్పూన్లు; కొబ్బరి నూనె/ నెయ్యి – 2 టేబుల్‌స్పూన్లు; నిమ్మకాయ రసం, లెమన్ జెస్ట్ (కాయపైన పచ్చగా ఉండే తొక్క తురుము) – 1; కొబ్బరి తురుము – కప్పు (బాల్స్‌ని అలంకరించడానికి)

**తయారీ:** ● కప్పు కొబ్బరి తురుము మినహా అన్ని పదార్థాలను మిక్సర్‌లో వేసి బ్లెండ్ చేయాలి ● ఈ మిశ్రమాన్ని గిన్నెలోకి తీసుకొని చిన్న చిన్న ముద్దలు తీసుకొని, ఉండలు చేయాలి ● వీటిని కొబ్బరి తురుములో రోల్ చేసి సర్వ్ చేయాలి. ఫ్రిజ్‌లో పెట్టి చల్లగానూ అందించవచ్చు.

## బేబీ బ్లూమిన్ ఆనియన్స్



**కావల్సినవి:** సాంబారు ఉల్లిపాయలు – 4; మజ్జిగ – 1 1/2 కప్పు; మైదా – 2 కప్పులు; ఉప్పు – తగినంత; మిరియాల పొడి – టీ స్పూన్; వెల్లుల్లి పొడి – టీ స్పూన్; కారం – అర టీ స్పూన్; బేకింగ్ పౌడర్ – చిటికెడు; నూనె – వేయించడానికి తగినంత

**తయారీ:** ● ఒక్కో ఉల్లిపాయను సగం వరకు కత్తితో పాయలుగా కట్ చేయాలి. పై నుంచి చూస్తే ఒక పువ్వులా రావాలి ● ఉల్లిపాయలను కొద్దిగా ఒత్తి, పాయలను విడదీయాలి. మజ్జిగలో కొద్దిసేపు ముంచి ఉంచాలి ● ఒక గిన్నెలో మైదా, ఉప్పు, మిరియాల పొడి, వెల్లుల్లి పొడి, కారం, బేకింగ్ పౌడర్ వేసి కలపాలి. మజ్జిగలో ముంచి ఉంచిన ఉల్లిపాయలను తీసి, ఆ మజ్జిగను పిండి మిశ్రమంలో వేసి కలపాలి ● కడాయిలో తగినంత నూనె పోసి వేడి చేయాలి ● మజ్జిగలో నానిన ఉల్లిపాయలను పిండిలో రోల్ చేయాలి ● వీటిని కాగుతున్న నూనెలో వేసి, ముదురు గోధుమరంగు వచ్చేవరకు అన్ని వైపులా వేయించాలి. దీనికి దాదాపు 8-10 నిమిషాల సమయం పడుతుంది. ఇలా వేయించిన ఉల్లిపాయలను తీసి పేపర్ టవల్‌మీద వేయాలి. ఉల్లిపాయలకు పట్టిన అదనపు నూనె టవల్ పీల్చుకుని, ఉల్లిపాయలు మరింత కరకరలాడుతాయి ● ఏదైనా సాస్‌తో వీటిని వడ్డించాలి.

**నోట్:** మైదాకు బదులు శనగపిండిని కలుపుకోవచ్చు.

# ఫైవ్ మినట్ బన్




ఈ హెయిర్ స్టయిల్ పేరు 'ఫైవ్ మినట్ బన్'. పేరుకు తగ్గట్టుగానే దీన్ని వేసుకోవడానికి అయిదు నిమిషాలు చాలు. మొదట్లో కొంచెం ఎక్కువ టైం పట్టినా... వేసుకుంటూ ఉంటే అయిదు నిమిషాలు సరిపోతుంది. ఈ హెయిర్ స్టయిల్‌ను విదేశీయులు వివాహ వేడుకల్లో ఎక్కువగా వేసుకుంటారు. అలాగే భారతీయులు కూడా ఈ మధ్య ఈ స్టయిల్‌ను బాగా ఫాలో అవుతున్నారు. గౌన్లు, స్కర్ట్స్, గాగ్రా, ఫ్యాన్సీ శారీస్ మీదకు ఈ హెయిర్ స్టయిల్ బాగా నప్పతుంది. మరి ఈ సిగ సోయగం మీకూ కావాలంటే.. వెంటనే వేసుకోండి మరి.



1. ముందుగా జుత్తునంతా చిక్కులు లేకుండా దువ్వుకోవాలి.
2. ఇప్పుడు ఫొటోలో కనిపిస్తున్న విధంగా... కింది భాగంలోని జుత్తుకు బ్యాండు పెట్టాలి.
3. ఆ పోనీని పూర్తిగా మెలితిప్పి, గుండ్రంగా కొప్పులా చుట్టాలి. చివర్లు బయటికి రాకుండా స్లైడ్స్ పెట్టేయాలి. పై భాగంలోని జుత్తు కిందకు రాకుండా టెంపరరీగా వాటికీ స్లైడ్స్ పెట్టాలి.
4. తర్వాత పై భాగంలోని జుత్తుకు పెట్టిన స్లైడ్స్‌ను తీసేయాలి. ఇప్పుడు ఆ జుత్తును రివర్స్‌లో దువ్వాలి (అంటే చివర్ల నుంచి మాడుకు... అలా చేస్తే పఫ్ బాగా వస్తుంది). ఆపైన మధ్య భాగంలోని జుత్తును తీసుకొని బ్యాండ్ పెట్టాలి.
5. ఇప్పుడు ఎడమ చెవి వైపు మరో రెండు పాయలను తీసుకొని, విడివిడిగా వాటికి బ్యాండ్స్ పెట్టాలి.
6. ఆపైన కుడి వైపు కూడా రెండు పాయలను తీసుకొని, విడివిడిగా బ్యాండ్స్ పెట్టి పోనీలు వేయాలి.
7. తర్వాత అన్ని పోనీలను... వాటి వాటి బ్యాండ్లలోంచి పై నుంచి కిందకు తీయాలి. (ఎలా అంటే.. బ్యాండ్ పెట్టాక, దాని పైభాగంలోని జుత్తును చేతి వేళ్లతో కాస్తంత దూరం చేయాలి. అప్పుడు పోనీని అందులోంచి పై నుంచి కిందకు తీయలి)
8. ఇప్పుడు రెండువైపుల ఉన్న నాలుగు చిన్న పోనీలను ఒక్కొక్కొటిగా మధ్య పోనీలోంచి పై నుంచి కిందకు తీయాలి.
9. ఆ మిగిలిన పెద్ద పోనీ (మధ్యది)ని పూర్తిగా మెలితిప్పాలి.
10. ఆ మెలితిప్పిన పోనీని కింద ఉన్న కొప్పు చుట్టూ చుట్టాలి. చివర్లు బయటికి రాకుండా స్లైడ్స్ పెట్టాలి.

# లాంగ్ బ్లౌజ్ విత్ లెహంగా

మాన్వి
డిజైనర్

నిర్వహణ:
ఎన్.ఆర్

కర్టెసీ: ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డిజైన్ ఇన్నోవేషన్ (ఐడిఐ), హైదరాబాద్
www.idi.co.in

అమ్మాయిలు లెహంగాల మీదకు దుపట్టా అవసరం లేకుండా ఇలా పొడవు బ్లౌజులు వేసుకోవడం తెలిసిందే! సింపుల్‌గా అనిపించే ఈ తరహా లాంగ్ బ్లౌజ్‌లను మెటీరియల్‌ను బట్టి క్యాజువల్ వేర్‌గానూ, పార్టీవేర్‌గానూ మార్చేసుకోవచ్చు. ఈ లాంగ్ బ్లౌజ్ డిజైన్ డ్రాఫ్టింగ్ ఈవారం తెలుసుకుందాం.




## ఫ్రంట్ బాడీ

AB= భుజం నుంచి నడుము భాగం వరకు (వెయిస్ట్ లెంగ్త్)
AC= ఆర్మ్ హోల్ భాగం
AD = ఛాతి వద్ద (అపెక్స్ లెంగ్త్ ) పొడవు
AA1= భుజాలు /2
CC1= ఛాతీ చుట్టుకొలత /4
BB1= నడుము కొలత/4 + డార్ట్ వాల్యూమ్
DD1= BB2 = అపెక్స్ విడ్త్ /2
A1 నుంచి స్ట్రెయిట్ లైన్ కిందుగా తీసుకొని C2 వరకు డ్రా చేయాలి.
మళ్లీ A1 నుంచి అంగుళం కిందుగా A2 దగ్గర సెంటర్ పాయింట్ మార్క్ చేయాలి.
A2 & C2 A4 లైన్ అవుతుంది.
A4 నుంచి లోపలి వైపు అర అంగుళం వంపు తీసుకొని A5 వద్ద మార్క్ చేయాలి.
అప్పుడు A2 A5 C1 ఫ్రంట్ సైడ్ ఆర్మ్‌హోల్ కర్వ్ అవుతుంది.
D1&B2 స్ట్రెయిట్ లైన్. B2 వద్ద అటు ఇటు రెండు వైపులా 1/2 అంగుళం వద్ద డార్ట్ B3 & B4 మార్క్ చేయాలి.
AAx= ఫ్రంట్ నెక్ డెప్త్

| బ్లౌజ్ కొలతలు ఇంచులలో... | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఛాతీ కొలత | 32 | 34 | 36 | 38 | 40 | 42 |
| ఛాతీ పై కొలత | 33 | 35 | 36 | 38 | 40 | 42 |
| నడుము | 15 | 15 | 16 | 16 | 17 | 17 |
| ఛాతీ కింది భాగం | 26 | 27 | 30 | 32 | 34 | 37 |
| భుజం | 11 | 12 | 12 | 13 | 13 | 14 |
| చేతులు | 3 | 3 | 3 | 3 | 3 | 3 |
| చంకభాగం | 14 | 15 | 15 | 16 | 17 | 17 |
| ఫ్రంట్ నెక్ | 6 | 6.5 | 7 | 7 | 7.5 | 7.5 |
| బ్యాక్ నెక్ | 8 | 8 | 8.5 | 8.5 | 9 | 9 |

లెహంగా కొలతలు..

| ఛాతీ కొలత | నడుము | లెహంగా లెంగ్త్ |
|---|---|---|
| 34 | 31 | 39 |
| 36 | 32 | 40 |
| 38 | 34 | 40 |
| 40 | 36 | 40 |
| 42 | 38 | 40 |

## బ్యాక్ బాడీ

AB= వెయిస్ట్ లెంగ్త్
AC= ఆర్మ్ హోల్ రౌండ్ /2
AD= అపెక్స్ లెంగ్త్
AA1= భుజం /2
CC1= ఛాతీ చుట్టుకొలత /2
BB1= నడుము చుట్టు కొలత /4 + డార్ట్ వాల్యూమ్
DD1=BB2= అపెక్స్ విడ్త్ /2
A1 నుంచి కిందుగా C2 వరకు స్ట్రెయిట్ లైన్ గీయాలి.
మళ్లీ A1 వద్ద నుంచి ½ అంగుళం కిందుగా A2 వద్ద మార్క్ చేసి సెంటర్ పాయింట్ A4 మార్క్ చేయాలి.
A2 A4 C1 ఆర్మ్‌హోల్ కర్వ్
D1&B2 స్ట్రెయిట్ లైన్. B2 వద్ద అటు అర అంగుళం ఇటు అర అంగుళం వదిలి డార్ట్ వాల్యూమ్ B3 &B4 మార్క్ చేయాలి.
Ax &A3 బ్యాక్ నెక్ డెప్త్






## ఫ్లెయిర్

AB= నడుము పొడవు
Ac= నడుము చుట్టుకొలత /4
BD= హిప్ రౌండ్ /4




## లెహంగా

ABCD= 40 అంగుళాలు
A A2= A A1= 1/6 నడుము చుట్టుకొలత
A1 B1 = A2C1= లెహంగా పొడవు
A1A2 - B1C1 వంపు భాగం





# భయం

● భమిడిపాటి గౌరీశంకర్

''నేనెక్కడున్నాను..'' అన్నాను మత్తుగా.. ముద్దుగా.. బద్ధకంగా.

''శ్మశానంలో''.. ఓ కోరస్ వినిపించింది.

''ఎవరు మీరంతా.. ఈ తెల్లని ఏకరూప దుస్తులేంటి? చిరాకుగా ఉంది'' మత్తుగా అన్నాను.

''నీకింకా మత్తు దిగినట్టు లేదు. కల్తీ కల్లు తాగితే చస్తార్రా ఎదవల్లారా అంటే వినరు కదా''... కోరస్‌గా గొంతు.

''కల్తీ కల్లు దొరక్క చస్తుంటే.. మీ బృంద గానాలొకటి''... విసుక్కున్నాను.

''నీకు మరీ భాషాభిమానంలా ఉందే. ఇంతకీ ఇక్కడికొచ్చి ఎందుకు చచ్చావు''... మళ్లీ కోరస్.

నాకు కోపం వచ్చింది. ''నేను చావలేదు. బ్రతకలేక చస్తున్నాను. చచ్చేలా బ్రతుకుతున్నాను.''

''నాయన... ఆ పేపర్ భాష ఆపు. లేకపోతే మేము చంపుతాం.''

''ఇంతకీ ఎవరు మీరంతా. ఈ తెల్లని దుస్తులెందుకేసుకున్నారు? ఆ జుత్తెందుకు అలా వదిలేసారు?''

''మేము దెయ్యాలం. ఏమో.. సినిమాల్లో, కథల్లో ఇలాంటి డ్రెస్సే వేయాలని చెప్పారు కదా..''

''అవునా.. మరి నేను..'' అన్నాను.

''అది నీవు చెప్పాలి'' అన్నాయి దెయ్యాలు.

''అవును. శ్మశానాలు ఇంకా ఉన్నాయా? అన్నీ కబ్జా అయిపోయాయి కదా. ఎవరింట్లో వారే చచ్చినవారిని తగలేసుకోవలసిన దినాలు కదా. అందుకయ్యే ఖర్చులు కూడా సబ్సిడీ మీద ఋణాలు ఇస్తున్నాయి కదా బ్యాంకులు.''

''కావచ్చు ఆ కథలు తరువాత. ముందు నీ కథ చెప్పి చావు.''

''మీ దెయ్యాల కథ చెప్పి చావండి''... రిటార్ట్ ఇచ్చా.

''ఆల్‌రెడీ చచ్చాం. మళ్లీ చావాలా. సరే చెబుతాం ఇను.''

విశాఖ నగరం... అందమైన నగరం. స్మార్ట్ సిటీగా ఎంపికైంది. అంతా వెలిగిపోతున్నాదని నాయకులు 'గంటా' (పదం తప్పకాదు) పథంగా చెబుతున్నారు. అటువంటి నగరానికి దూరంగా ఓ పెద్ద ఫ్లై ఓవరుంది. దాని కింద కొన్ని గుడిసెలున్నాయి. ఆ గుడిసెల్లో మనుషులు లేని వేళ పందులు, అవి లేని వేళ మనుషులుంటారు. మనుషులంతా రోజులో ప్రపంచంలో ఎన్ని రకాల పనులున్నాయో అన్ని రకాలు చేస్తారు. కొందరు 'రాత్రి పనులు' మాత్రమే చేస్తారు. ఆకలి కదా మరి.

ఏది ఏమైనా వారంతా మనుషులు. మనుషులు కాని మనుషులు. విశాఖ నగరంలో... అందమైన నగరంలో జాతీయ, అంతర్జాతీయ సదస్సులు, ప్లీట్‌లు జరుగుతున్న నగరంలో ఉన్న ప్రాంతం. అక్కడ బతుకుతున్న జనం...

ఒకరోజు...

'ఇక్కడ నుంచి మెట్రో రైలు మార్గం వేస్తున్నారు. పనులు తొందరలోనే జరుగుతాయి. వారంలోగా మీరంతా ఈ ప్రాంతాన్ని ఖాళీ చేయాలి' అని అధికారులు తాఖీదులిచ్చారు.

''అంటే ఏమిటి?'' అడిగారు జనం అమాయకంగా.

''అభివృద్ధి.. రైలుమార్గం.. జపాన్.. సింగపూర్‌లా అన్నమాట'' అధికార్లు బూరా ఊదారు.

''అక్కడ కూడా మాలాంటి వారున్నారన్న మాట. వారిని తరిమేసి, రైళ్లు వేసారన్నమాట. మనుషుల కన్నా అవే ఎక్కువన్నమాట''

## కిసుక్కు





**పరీక్షల పరిణామక్రమం**

1995 – అన్ని ప్రశ్నలకు జవాబు రాయండి.
2000 – ఏదేని 5 ప్రశ్నలకు జవాబు రాయండి.
2018 – క్వశ్చన్ పేపర్ మొత్తం చదివితే సరిపోతుంది.
2025 – పరీక్షకు హాజరయ్యారు. ఇది చాలు.

## మీకు తెలుసా





హర్రర్ మూవీస్‌లో ఎక్కువగా కనిపించే క్యారెక్టర్ డ్రాకూలా.
ఐరిష్ రచయిత బ్రమ్ స్టాకర్ ఈ డ్రాకులాను సృష్టించాడు.

అన్నారు మరింత అమాయకంగా.

''మీకు ప్రభుత్వం భూములిస్తుంది. ఇళ్లు కట్టుకొనేందుకు బ్యాంకులు లోనిస్తాయి. రేషన్ కార్డులు, ఆరోగ్యశ్రీ కార్డులు, అన్నపూర్ణ, ఆధార్, పాన్ కార్డులిస్తారు. మీ పిల్లలకు ఉద్యోగాలు...''

''మాకు పెళ్ళిళ్ళు కాలేదయ్యా. ఎవరూ పిల్ల నివ్వలేదు'' అన్నారు మగాళ్లంతా.

''పెళ్ళి చేసుకోవటానికి పిల్లలు కావాలని ఓ పిటిషన్ రాసివ్వండి. కలక్టర్‌కిస్తాం'' అని ఒక అధికారి నాలిక కరుచుకున్నాడు.

''అలాగే సామి.. ఓ పది మందైతే సరిపో తారు. లేదా సర్దుకుపోతాం. ఎలా రాయాలో మీరే రాసియ్యండి సామి. ఏలి ముద్రగాళ్ళం... మాకేటి తెలుస్తాది. కావాలంటే నిశానీలేస్తాం'' అన్నారు జనం.. మరింత అమాయకత్వంతో.

అధికార్లు అసహనంగా, కోపంగా ''మరో వారానికి ఖాళీ చేయండి'' అన్నారు మరేమీ అన లేక.

ప్రతిపక్షం వాళ్లు వద్దన్నారు. ప్రభుత్వం వారిని 'అభివృద్ధి నిరోధకులంది'.

ఒకరోజు... నిర్మాణంలో ఉన్న ఫ్లై ఓవర్ కూలిపోయింది. దాదాపు పదిహేను మంది చని పోయారు. కాంట్రాక్టరు చనిపోయిన వారి కుటుంబాలకు లక్ష చొప్పున ఇచ్చాడు. తరువాత నిర్మాణ పనుల బడ్జెట్ పెంచాడు (లంచాల శాతం పెరిగింది..ట). ప్రభుత్వం 'మానవతా దృక్పథం'తో స్పందించి బడ్జెట్‌ను అంగీకరిం చింది.

అలాగ జనం ఆ ప్రాంతాన్ని ఖాళీ చేసారు. కాదు... భయపెట్టి ఖాళీ చేయించారు.

ఇది జరిగి పదిహేనేళ్ళయింది. అక్కడ ఏమీ లేదు. విరిగిన ఫ్లై ఓవర్‌ను మాత్రం అతికారు. ఆ పదిహేను మందిలో మేము కూడా ఉన్నాం.

''దారుణం..'' అన్నాను నేను.

''నిజమే.. దారుణం..'' దెయ్యాల కోరస్.

''ఇప్పుడు చెప్పు నీవెందుకు చావాలనుకు న్నావు. ఇంతకీ చచ్చావా లేదా?''

''తెలియదు. ప్రస్తుతానికి చస్తూ బ్రతుకుతు న్నాను. బతకటానికి చస్తున్నాను.''

''ఆపు ఆ సినిమా భాష. వినలేక ఛస్తున్నాం'' దెయ్యాల కోరస్.

''అదేంటి చచ్చామన్నారు కదా. అంటే చావ లేదా..?'' నా సందేహం.

''కోడిగుడ్డు మీద ఈకలు లాగటం ఆపి, అసలు విషయం చెప్పిచావు'' అన్నాయి దెయ్యాలు కోపంగా.

దెయ్యాలు కోపాన్ని ఎల్లా ఎక్స్‌ప్రెస్ చేస్తాయి..?

సందేహాలు మానేసి.. సమాధానం చెప్పద లచాను.

''నేనో మధ్యతరగతి మనిషిని. ఆశలు, భయాలు ఎక్కువ. భయాన్ని ఆశలు చంపు తాయి. కోరికలు తలెత్తుతాయి.'' ''నీకు టీవీలో బాబాలు చెప్పే సొల్లు వినే అలవాటుందా నాయనా'' అంది ఓ దెయ్యం బాబా లెవెల్లో.

''అది దెయ్యం బాబాలే నాయనా. నీవు చెప్పు'' అన్నాయి మిగిలిన దెయ్యాలు.

''అంటే.. బాబాలాంటి దెయ్యమా? దెయ్యం లాంటి బాబానా? ఇక్కడ దెయ్యాల లాంటి బాబాలే ఎక్కువ కదా.''

''అవన్నీ తరువాత. ముందు నీ కథ చెప్పు.''

''ఓ.కె. ఒకనాడు ఓ గోల్డ్ స్కీమ్ ఏజంట్ వచ్చాడు... పది వేలు కడితే ఆరు నెలలకి లక్షన్నర ఇస్తామని. నేను మరో పదిమంది చేత కట్టిస్తే రెండు లక్షలిస్తారని చెప్పాడు. బంగారం లాంటి అవకాశమన్నాడు. నేను నమ్మాను. మరో పది మంది చేత నమ్మిం చాను. సంవ త్సరం తిరిగే సరికి గోల్డ్ సంస్థను మూసేసారు. నిండా మునిగాను. నన్ను నమ్మినవారు మునిగారు. నన్ను తంతామన్నారు. తన్నేరు కూడా. బాధను మరవటానికి తాగాను. మా ఆవిడ నన్నొదిలేసి కన్నవారింటికి వెళ్ళిపోయింది. పోలీసు కేసు పెట్టారు. స్నేహితులు కాపుకాసి కాపాడారు. జైలుకి వెళ్ళవలసిన అవసరం తప్పిపోయింది. ఊరి నుంచి పారిపోయాను. చద్దామనుకుంటు న్నాను. చెప్పండి... చావాలా? వద్దా?'' నాకు ఏడుపు వచ్చింది. కన్నీరు మూసీ నదిలోని మురికి నీరులా తన్నుకు వచ్చింది.

''అయినా ఒరే.. పది వేలు కడితే ఆరు నెలల్లో లక్ష ఎలా ఇస్తారురా. ముష్టివాడికి పావలా వేయటానికి చెల్లదని తెలిసినా పది సార్లు ఆలోచిస్తారు కదా. లక్షలకు లక్షలు ఎలా వాడి ఎదాన పడేస్తున్నారు. ఎర్రి సన్నాసు లారా..!''

''ఆశ నాయనా. ఆశ.'' బాబా దెయ్యం ఉవాచ.

**"బాధను మరవటానికి తాగాను. మా ఆవిడ నన్నొదిలేసి కన్నవారింటికి వెళ్ళిపోయింది. పోలీసు కేసు పెట్టారు. స్నేహితులు కాపు కాసి కాపాడారు. జైలుకి వెళ్ళవలసిన అవసరం తప్పిపోయింది. ఊరి నుంచి పారిపోయాను. చద్దామనుకుంటున్నాను. చెప్పండి... చావాలా? వద్దా?"**





**భయాన్ని తరిమేయాలని అనుకోవటం కన్నా, అది సృష్టించబడకుండా ఉండటమెలాగో చూడాలి. భయం లేకుండా జీవిస్తే జీవితమంతా అవకాశాలమయంగా కనిపిస్తుంది. ఆటంకాలు తొలగిపోయి జయాలు తప్పక సిద్ధిస్తాయి.**

''నువ్వు కాస్త మూసుకో. అర్ధరాత్రి అమ్మాయిల సేవలను భక్తి సేవలని చెప్పే కామ బాబాలు చెప్పే మాటలంటే అసహ్యం.''

''అంటే.. మన బాబా దెయ్యం కూడా అదే టైపా?'' అన్నాను ఆశగా.

''నోర్మూయ్. వెధవ మనిషి సందేహాల నీవునూ'' అన్నాయి దెయ్యాలు.

కొంచెం సేపు మా మధ్య నిశ్శబ్దం. తూర్పున వెలుగు రేఖలు విచ్చుకుంటున్నాయి.

''నాయనా.. వర్తమానంలో అధికార్లు, ప్రభుత్వం, చిట్ కంపెనీలు అన్ని ఓ మాయ. ఓ దెయ్యాల ప్రపంచం.. బాబాల కన్నా వారే కమ్మగా కబుర్లు చెబుతున్నారు. వారికి కావలసిన విధంగా జనాలను మలుచుకుంటున్నారు. జనాలు చావాలనుకోకూడదు. బ్రతకాలి. అటువంటి వారికి బుద్ధి చెప్పటం కోసమైనా బతకాలి'' బాబా దెయ్యం సలహా.

మిగిలిన దెయ్యాలు అదే నిజమన్నాయి. శ్మశానం నిశ్శబ్దమైపోయింది. నగరం లాంటి శ్మశాన నిశ్శబ్దం కన్నా శ్మశాన నిశ్శబ్దం బాగుంది. ప్రశాంతంగా ఉంది.

నేను మెల్లగా లేచాను. దెయ్యాలకున్న పాటి జ్ఞానం కూడా నాకు లేనందుకు బాధపడ్డాను.

ఇదంతా కలా..? నిజమా..? నేను దెయ్యాలను చూసానా? వాటితో మాట్లాడానా? వాస్తవంలో ఇది సాధ్యమా?

వాస్తవమే. చావు భయం.. చావలనే ధైర్యం.. దెయ్యాల వంటివి. వాటితో నేను ఎంతో కాలంగా సహజీవనం చేస్తున్నాను. కోరికలు కూడా దెయ్యాలే. మరణాన్ని అవి ఆహ్వానిస్తాయి.''

ఏదో ఉపన్యాసంలో సద్గురు జగ్గీబాబా మాటలు గుర్తుకు వచ్చాయి.

''జీవితమూ మరణమూ కలిసే వస్తాయి. జీవనం సాగాలంటే, మరణం సంభవించడానికి అవకాశం ఇచ్చి తీరాలి. భయం సహజమైనది కాదు. దాన్ని సృష్టించే వ్యక్తే, దాన్ని సృష్టించడం ఆపేస్తే సరి. భయమనేది మిమ్మల్ని మీరే ఓడగొట్టుకొనే ఆయుధం. భయాన్ని తరిమేయాలని అనుకోవటం కన్నా, అది సృష్టించబడకుండా ఉండటమెలాగో చూడాలి. భయం లేకుండా జీవిస్తే జీవితమంతా అవకాశాలమయంగా కనిపిస్తుంది. ఆటంకాలు తొలగిపోయి జయాలు తప్పక సిద్ధిస్తాయి.''

ఆ దిశగా నేను ప్రయాణించాలనుకొన్నాను. నేను దెయ్యాలను చూడాలనుకోవటంలేదు. బహుశా ఇంక అవి కనిపించకపోవచ్చు.

●

**● కిసుక్కు**



అనసూయమ్మ: డాక్టర్...ఈ లోకంలో అందరూ నన్ను ద్వేషిస్తున్నారనిపిస్తుంది. ఎవరికీ నేనంటే మంచి అభిప్రాయం లేదు.

డాక్టర్: అలా ఎందుకనుకుంటున్నారు. మీరు చాలామంచివారు.

అనసూయమ్మ: ఆ విషయం నాకు తెలుసనుకోండి..కానీ నేను ఎంత మందికి ఫీజు ఇవ్వగలను?

**● మీకు తెలుసా**



బ్యాంకాక్‌లోని వాట్ ట్రైమిట్ ఆలయంలో 5,500 కిలోల బుద్ధుడి బంగారు విగ్రహం ఉంది.

**● అపోహ - వాస్తవం**

# రక్తం అంటే ఎర్రగానే ఉంటుందా?



రక్తం అనగానే ఎర్రటి రంగే గుర్తుకు వస్తుంది. మానవ రక్తంతో పాటు చాలా జీవుల్లో ఉండే రక్తం ఎర్రగా ఉండటానికి కారణం అందులో ఉండే హీమోగ్లోబిన్ అనే ఎరుపు రంగును ఇచ్చే పిగ్మెంట్. మన రక్తంలో ఆక్సిజన్‌ను తీసుకెళ్లే హీమోగ్లోబిన్ అనే ఇనుము ఆధారిత పదార్థం వల్ల రక్తానికి ఈ ఎరుపు రంగు వస్తుంది. ఇక వెన్నెముక కలిగిజ జీవుల్లోనేవ గ్రీన్ బ్లడెడ్ స్కింక్స్ అనే ఒక రకం బల్లుల రక్తం ఆకుపచ్చరంగులో ఉంటుంది. మనకు ఇనుము ప్రధానంగా ఉన్నట్లే... కొన్ని రకాల పీతల్లోని రక్తం కాపర్‌ను కలిగి ఉంటుంది. కాపర్ ప్రధానంగా ఉండే ఈ రకాలకు చెందిన పీతల (క్రాబ్స్) రక్తం నీలం రంగులో ఉంటుంది. ఇలా నీలం



రంగులో రక్తం కనిపించడానికి హీమోసయనిన్ అనే నీలిరంగును ఇచ్చే పదార్థమే కారణం. ఇక బొద్దింక (కాక్రోచ్) రక్తంలో ఎర్ర రంగు లోపించడం వల్ల వాటి రక్తం తెల్లరంగులో ఉంటుంది. అన్నట్లు కొన్ని కీటకాల రక్తం పసుపుపచ్చ రంగులోనూ ఉంటుంది.

• సందేహం

# బావను పెళ్లి చేసుకోవచ్చా?


డా॥ వేనాటి శోభ
లీలా హాస్పిటల్
మోతీనగర్,
హైదరాబాద్


**● నేను డిగ్రీ పూర్తి చేశాను. నేను మా బావ లవ్‌లో ఉన్నాం. ఇద్దరికీ వయసులో మూడేళ్ల తేడా ఉంది. మా అమ్మానాన్నలది మేనరికం పెళ్లి. నేను, మా బావ పెళ్లి చేసుకున్నట్లయితే పుట్టబోయే బిడ్డలకు సమస్యలు తలెత్తుతాయని, మేనరికం మంచిది కాదని చాలామంది చెబుతున్నారు. నాకు మా బావ అంటే చాలా ఇష్టం. అతన్ని వదులుకోలేను. నా సమస్యకు పరిష్కారం ఏమైనా ఉందా?**

**- లావణ్య, హైదరాబాద్**

మేనరికపు పెళ్లిళ్ల వల్ల, అంటే దగ్గరి రక్తసంబంధీకులు పెళ్లి చేసుకున్నప్పుడు వారి జన్యువులలో ఏ చిన్న సమస్య ఉన్నా, ఇద్దరి జన్యువులు బిడ్డకు సంక్రమించడం జరుగుతుంది కాబట్టి పుట్టే బిడ్డలో అది బయట పడుతుంది. ముందు తరాల వాళ్లవి కూడా మేనరికపు పెళ్లిళ్లే అయితే పుట్టే బిడ్డకు సమస్యలు తలెత్తే అవకాశం ఇంకా పెరుగుతుంది. మామూలుగా పెళ్లి చేసుకునేవారి పిల్లల్లో జన్యు సమస్యలు, అవయవ లోపాలు, ఇతర సమస్యలు 2–3 శాతం ఉంటే, మేనరికపు పెళ్లిళ్ల వల్ల పుట్టే పిల్లల్లో ఈ సమస్యలు 4–6 శాతం వరకు ఉండవచ్చు. అంటే రెట్టింపు అన్నమాట. అంతేకాని మేనరికపు పెళ్లిళ్ల వల్ల పుట్టే పిల్లలందరికీ సమస్యలు ఉంటాయనేమీ లేదు. పెళ్లికి ముందుగా మీరిద్దరూ ఒకసారి జెనెటిక్ కౌన్సెలర్‌ను సంప్రదించండి. మీ కుటుంబంలోని అందరి వివరాలు, వారిలో ఉండే సమస్యలు వంటివి అన్నీ అడిగి తెలుసుకుని, వివరాలన్నింటినీ విశ్లేషించి మీకు పుట్టబోయే బిడ్డలకు సమస్యలు వచ్చే అవకాశాలు ఎంతవరకు ఉంటాయో తెలిపే ప్రయత్నం చేస్తారు. అవసరమైతే మీరిద్దరికీ రక్త పరీక్ష చేసి చూస్తారు. జెనెటిక్ కౌన్సెలర్లు కూడా మీకు పుట్టబోయే బిడ్డలకు జన్యు సమస్యలు వస్తాయని గాని, లేదని గాని నూటి నూరు శాతం ముందుగానే చెప్పలేరు. అయితే, వీలైనంత వరకు మేనరికపు పెళ్లిళ్లను నివారించడమే క్షేమం. తప్పనిసరి పరిస్థితుల్లో చేసుకున్నా, పుట్టబోయే బిడ్డలకు సమస్యలు వచ్చే అవకాశాలు ఉన్నట్లయితే, వాటిని నివారించడానికి ఎలాంటి మందులు, ఇంజెక్షన్లు లేవు. కాకపోతే బిడ్డ కడుపులో ఉన్నప్పుడే కొన్ని రకాల జన్యు సమస్యలు, అవయవ లోపాలు గుర్తించడానికి మూడో నెల చివరలో ఎన్‌టీ స్కాన్, డబుల్ మార్కర్ టెస్ట్ లేదా క్వాడ్రుపుల్ టెస్ట్ చేయించుకోవడం మంచిది. ఐదో నెల చివరలో 2డీ ఎకో స్కాన్ చేయించుకుంటే గుండెలో రంధ్రాలు వంటివి ఉన్నట్లయితే ముందుగానే తెలుసుకోవచ్చు. కొన్ని రకాల జన్యు సమస్యలు, అవయవ లోపాలు బయటపడినప్పుడు, వాటికి చికిత్స లేనప్పుడు పుట్టిన తర్వాత జీవితాంతం బాధపడే కంటే ముందుగా తెలుసుకోవడం వల్ల వద్దు అనుకుంటే ఐదో నెల లోపల అబార్షన్ చేయించుకునే అవకాశాలు ఉంటాయి. కాకపోతే, కొన్ని రకాల పరీక్షలు చేయించుకున్నా, పుట్టబోయే బిడ్డలో ఎటువంటి సమస్యలూ ఉండవని నూటికి నూరు శాతం చెప్పలేము. మూగ, చెవుడు, బుద్ధిమాంద్యం, మెటబాలిక్ డిజార్డర్, హార్మోన్ల లోపాలు వంటివి బిడ్డ పెరిగే కొద్దీ బయటపడతాయి.



పురానీతి
28వ పేజీలో


**నా వయసు 24 ఏళ్లు. పీరియడ్స్ సమయంలో విపరీతమైన కడుపునొప్పి వస్తోంది. డాక్టర్‌ను సంప్రదిస్తే మాత్రలు రాసిచ్చారు. అవి వేసుకుంటే నొప్పి తగ్గుతోంది. ప్రతిసారీ నొప్పి ఉంటోంది. అలాగని మాత్రలను ఎక్కువగా వాడితే దుష్ఫలితాలు ఉంటాయేమోనని భయంగా ఉంది. నాకు బలపాలు, సుద్దముక్కలు తినే అలవాటు ఉంది. మంచిది కాదని తెలిసినా మానుకోలేకపోతున్నాను. ఏం చేయాలో సలహా ఇవ్వగలరు.**

**- శశి, నూజివీడు**

మెచ్యూరైన తరువాత కొందరిలో హార్మోన్స్ సక్రమంగా పనిచెయ్యడానికి సంవత్సరం నుండి రెండు సంవత్సరాల సమయం పట్టవచ్చు. దాని వల్ల ఆ సమయంలో పీరియడ్స్ సక్రమంగా ఉండకపోవచ్చు. వేరే సమస్యలు ఏమీ లేనప్పుడు దాని వల్ల ఇబ్బంది ఏమీ లేదు.

పీరియడ్స్ సమయంలో ప్రోస్టాగ్లాండిన్స్ అనే హార్మోన్స్ విడుదల అవుతాయి. అవి విడుదలయ్యే మోతాదును బట్టి గర్భాశయం కండరాలు కుదించుకుని బ్లీడింగ్ బయటకు రావడం వల్ల కొందరిలో కడుపు నొప్పి వస్తుంది. ఒక్కొక్కరి శరీరతత్వాన్ని బట్టి నొప్పి తీవ్రత ఉంటుంది. ఈ నొప్పి మరీ ఎక్కువగా ఉంటే, నొప్పి ఉన్న రోజులలో రోజుకు రెండు చొప్పున నొప్పి నివారణ మాత్రలు వాడవచ్చు. నెలకి రెండు రోజులు నొప్పి మాత్రలు వాడడం వల్ల ప్రమాదం ఏమీలేదు.

కొందరిలో గర్భాశయంలో గడ్డలు, అండాశయంలో సిస్టులు వంటి ఇతర సమస్యలు ఉన్నప్పుడు కూడా పీరియడ్స్ సమయంలో నొప్పి ఎక్కువగా ఉండవచ్చు. అశ్రద్ధ చేయకుండా ఒకసారి స్కానింగ్ చేయించుకొని, గర్భాశయంలో కాని, అండాశయాలలో ఏమైనా సమస్యలు ఉన్నాయా లేదా అని తెలుసుకోవడం మంచిది. కారణాన్ని బట్టి చికిత్స తీసుకోవచ్చు.

రక్తం తక్కువ ఉన్నప్పుడు బలపాలు, చాక్‌పీస్‌లు, బియ్యం వంటివి తినాలని అనిపిస్తుంది. కడుపులో నులిపురుగులు ఉండడం వల్ల, అవి శరీరం లోపల రక్తాన్ని పీల్చుకోవడం వల్ల రక్తం తగ్గి బలపాలు తినాలనిపిస్తుంది. కాబట్టి నువ్వు ఒకసారి రక్తం ఎంత ఉందో complete blood picture (cbp) పరీక్ష చేయించుకొని రక్తం తక్కువ ఉంటే, పెరగడానికి ఆకుకూరలు, పప్పులు, పండ్లు, మాంసాహారంతో పాటు ఐరన్ మాత్రలు వేసుకోవాలి. అలాగే నులి పురుగులకు కూడా ఆల్‌బెండజోల్ మాత్ర ఒక్కటి తీసుకోవచ్చు.

# అర్జునుడి గురుదక్షిణ

భరద్వాజ మహర్షి కొడుకు ద్రోణుడు. తండ్రి వద్దనే విద్యాభ్యాసం చేసేవాడు. భరద్వాజుడికి పాంచాల దేశాధీశుడు పృషతుడు చిరకాల మిత్రుడు. తన కొడుకు ద్రుపదుడిని భరద్వాజుడి ఆశ్రమంలో చేర్చాడు. ద్రోణుడు, ద్రుపదుడు సహాధ్యాయులుగా విద్యాభ్యాసం చేసేవారు. కొంతకాలానికి పృషతుడు కాలం చేయడంతో ద్రుపదుడు తన రాజ్యానికి వెళ్లి, పట్టాభిషిక్తుడై రాజ్యభారం మోయాల్సి వచ్చింది.

అస్త్రవిద్యపై ఆసక్తి గల ద్రోణుడు తండ్రి వద్ద విద్యాభ్యాసం చాలించుకున్న తర్వాత అగ్నివేశుడనే ముని వద్ద చేరి అస్త్రవిద్యను అభ్యసించాడు. ద్రోణుడి శుశ్రూషకు అగ్నివేశుడు సంతసిల్లాడు. ద్రోణుడికి ధనుర్వేదాన్ని ఆమూలాగ్రంగా నేర్పించాడు. అగ్నివేశుడి వద్ద విద్యాభ్యాసం పూర్తి చేసుకుని తిరిగి వచ్చిన ద్రోణుడికి భరద్వాజుడు కృపి అనే కన్యతో వివాహం జరిపించాడు. వారికి అశ్వత్థామ అనే కొడుకు కలిగాడు.

సంసారభారం మీద పడటంతో ద్రోణుడికి ద్రవ్యార్జన అనివార్యంగా మారింది. ఎన్ని ప్రయత్నాలు చేసినా ద్రోణుడికి పరిస్థితులు కలసిరావడం లేదు. క్షత్రియులను నిర్జించిన పరశురాముడు సంపదనంతా బ్రాహ్మణులకు పంచిపెడుతున్నట్లు విన్న ద్రోణుడు. పరశురాముడిని వెదుక్కుంటూ బయలుదేరాడు. మహేంద్రగిరిపై తపోనిష్ఠలో ఉన్న పరశురాముడిని కలుసుకున్నాడు.

‘ఎవరివి నీవు? ఎందుకు వచ్చావు?’ అని పరశురాముడు ప్రశ్నించగా, ‘నేను భరద్వాజుడి కుమారుడను. విత్తాపేక్షతో వచ్చాను’ అని బదులిచ్చాడు ద్రోణుడు. అందుకు పరశురాముడు చాలా విచారించాడు. ‘తరుణం మించిన తర్వాత వచ్చావు నీవు. నా వద్దనున్న సంపదనంతా ఇతరులకు పంచిపెట్టేశాను. నా వద్ద ప్రస్తుతం దివ్యాస్త్ర శస్త్రాలు తప్ప మరేమీ లేవు’ అని అన్నాడు. ‘మహాత్మా! వాటినే అనుగ్రహించండి’ అని పలికిన ద్రోణుడు


చీకట్లో ఒకరోజు 37వ పేజీలో

పరశురాముడి నుంచి అస్త్ర శస్త్రాలను తీసుకుని ఇంటికి వచ్చాడు. అస్త్రశస్త్రాలు ఆకలి తీర్చలేవు కదా! ఇంట్లో పసిబాలుడైన అశ్వత్థామ ఆకలికి అల్లాడిపోతున్నాడు. అలాంటి విపత్కర పరిస్థితిలో ద్రోణుడికి బాల్యమిత్రుడైన ద్రుపదుడు గుర్తుకొచ్చాడు. సహాయం చేస్తాడనే ఆపేక్షతో పాంచాల రాజధానికి బయలుదేరాడు. ద్రుపదుడి సభకు వెళ్లాడు. ద్రోణుడెవరో గుర్తించనట్లే నటించాడు ద్రుపదుడు. ద్రోణుడు తనను తాను పరిచయం చేసుకుని, బాల్యస్మృతులను గుర్తుచేస్తే, ‘మహారాజునైన నేనెక్కడ. దరిద్రుడవైన నీవెక్కడ’ అంటూ తూలనాడాడు. అవమాన భారంతో ద్రోణుడు వెనుదిరిగాడు.

కొంతకాలం గడిచాక బావమరిది అయిన కృపాచార్యుడి సహాయంతో ధృతరాష్ట్రుడి వద్ద కొలువు పొందాడు. పాండు తనయులకు, కౌరవులకు అస్త్రవిద్య నేర్పించాడు. వారిలో పాండవ మధ్యముడు అర్జునుడు మేటిగా తయారయ్యాడు. గురుదక్షిణ ఏమివ్వాలని కోరారు శిష్యులు. ద్రుపదుడు తనకు చేసిన అవమానాన్ని వివరించి, అతడికి గుణపాఠం చెబితే చాలన్నాడు ద్రోణుడు. పాండవులు, కౌరవులు అస్త్రధారులై పాంచాల దేశాన్ని ముట్టడించారు. ద్రుపదుడు స్వయంగా రణరంగంలోకి దిగి వీరవిహారం మొదలుపెట్టాడు. కౌరవులు అతడి ధాటికి తాళలేక పరుగులు తీశారు. పరిస్థితిని గమనించిన అర్జునుడు నేరుగా ద్రుపదుడితో తలపడ్డాడు. ద్రుపదుడిని నిరాయుధుడిగా చేసి పట్టి బంధించి తెచ్చి ద్రోణుడి సమక్షంలో నిలిపాడు. ‘గురూత్తమా! ఇదిగో నా గురుదక్షిణ’ అని పలికాడు.

ద్రోణుడు విజయ దరహాసం చిందిస్తూ ద్రుపదుడిని తేరిపార చూశాడు. ‘ఓహో! ద్రుపద మహారాజా! ఇప్పటికైనా మమ్ము జ్ఞప్తికి తెచ్చుకొందురా?’ అని పలికాడు. అవమాన భారంతో తలదించుకున్నాడు ద్రుపదుడు. ‘ఇకనైనా బ్రాహ్మణులను అవమానించకు’ అని హితవు పలికి అతడిని విడిచిపుచ్చాడు ద్రోణుడు.



• పాటతత్వం

# గాలి పల్లకిలోన తరలి నా పాట పాప వూరేగి వెడలె...



**సిరివెన్నెల**
గీత రచయిత

**పాట: జగమంత కుటుంబం నాది.. సినిమా: 'చక్రం'**
**గీత రచయిత: సిరివెన్నెల సీతారామశాస్త్రి,**
**సంగీతం: చక్రి**



**మహిత్‌నారాయణ్**
సంగీత దర్శకుడు

''మనిషి తత్వాన్ని.. మనస్తత్వాన్ని చాటి చెప్పే అరుదైన పాటల్లో 'జగమంత కుటుంబం..' పాట తప్పకుండా అగ్రస్థానంలో ఉంటుంది. మనిషి స్వార్థజీవి.. ఈ జగమంతా, ఈ జీవితమంతా తనదే అనుకుంటాడు. కానీ, చివరికి ఏకాకిగా కాలం చేయాల్సిందే. ఈ జీవితం నీది కాదు.. లోకానిది. బతికిన కొన్నాళ్లైనా నలుగుర్నీ నవ్వించాలని, మరణించిన తర్వాత నలుగురూ మన గురించి మాట్లాడుకోవాలని చెప్పే పాట ఇది'' అన్నారు సంగీత దర్శకుడు, చక్రి తమ్ముడు మహిత్ నారాయణ్. ప్రభాస్ హీరోగా కృష్ణవంశీ దర్శకత్వంలో రూపొందిన చిత్రం 'చక్రం'. చక్రి స్వరకల్పనలో సిరివెన్నెల సీతారామశాస్త్రి గారు రాసిన 'జగమంత కుటుంబం..' పాటతత్వం గురించి మహిత్ మాటల్లో...



'జగమంత కుటుంబం..' పాట ఎక్కడ వినిపించినా మనసంతా అటువైపు పరుగులు తీస్తుంది. ఆ పాటలోని ఆవేదన అటువంటిది. అన్నయ్య సంగీతం అందించిన పాట ఇది అని చెప్పడం లేదు. బిడ్డను కన్నప్పుడు పడే పురిటినొప్పుల ప్రసవ వేదన ఎలా ఉంటుందో.. ప్రతి పాట వెనుకా కవి అటువంటి ఆవేదనను అనుభవిస్తాడు. ఈ పాటలో శాస్త్రిగారి ఆవేదన కనిపిస్తుంది.

**పల్లవి:** **జగమంత కుటుంబం నాది.. ఏకాకి జీవితం నాది**
**జగమంత కుటుంబం నాది.. ఏకాకి జీవితం నాది**
**సంసార సాగరం నాదే.. సన్యాసం శూన్యం నావే**
**జగమంత కుటుంబం నాది.. ఏకాకి జీవితం నాది**

ఈ శ్వాస ఇక నీది కాదు.. పొమ్మంటున్న తరుణాన ఎలాంటి దృశ్యాలు కళ్ల ముందు తారసపడతాయో ఈ పాటలో ప్రత్యేకంగా కనిపిస్తుంది. ఈ జగమంతా.. అన్నింటిలో మనిషే ఉన్నాడనిపిస్తుంది. ఏదీ వదులుకోవడానికి మనిషి మనసు ఇష్టపడదు. కానీ, వదులుకోక తప్పదు. ఆత్మ ఏకాకి కాక తప్పదు. శ్వాస వదలక తప్పదు. బతికినంతకాలం మన చుట్టూ ఎందరు ఉన్నా.. చివరకి ఏకాకిగా జీవితానికి ముగింపు పలకక తప్పదు.

**చరణం 1:** **కవినై కవితనై.. భార్యనై భర్తనై (2)**
**మల్లెల దారిలో.. మంచు ఎడారిలో (2)**
**పన్నీటి జయ గీతాల.. కన్నీటి జలపాతాల**
**నాతో నేను అనుగమిస్తూ.. నాతో నేనే రమిస్తూ**
**ఒంటరినై అనవరతం.. కంటున్నాను నిరంతరం**
**కలల్ని కథల్ని.. మాటల్ని పాటల్ని.. రంగుల్నీ రంగవల్లుల్ని..**
**కావ్యకన్యల్ని ఆడపిల్లల్ని ॥జగమంత..॥**

మనిషి అనేవాడు సకల కళా వల్లభుడు. ఇల్లూ.. ఇల్లాలు.. పిల్లలు.. ఆస్తి.. అంతస్తులు.. అన్నీ తనవే అనుకుంటాడు. మనిషి తత్వమే అంత. అది మంచిదే. కానీ, చివరకు మిగిలేది ఏంటి? అనేది పల్లవిలో చెప్పారు. మనిషి ఎప్పుడూ జీవితం మల్లెల దారిలా ఉంటుందనుకుంటాడు. కలలు కంటుంటాడు. పైకి చల్లగా ఉన్నా లోపల మంటలు రగిలించే ఎడారి తోవ ఈ జీవితం. కష్టసుఖాలు.. కన్నీరు.. పన్నీరు.. ఒకదాని తర్వాత ఒకటి వస్తూనే, పోతూనే ఉంటాయి. ఏవీ శాశ్వతం కాదు. అశాశ్వతమైనది ఉంటే అది నువ్వే. నువ్వు ఈ భూమ్మీద ఉండవు. నువ్వు చేసే మంచి మాత్రమే మిగులుతుంది.

**చరణం 2:**
**మింటికి కంటిని నేనై.. కంటను మంటను నేనై (2)**
**మంటల మాటున వెన్నెల నేనై**
**వెన్నెల పూతల మంటను నేనై**
**రవినై శశినై దివమై నిశినై**
**నాతో నేను సహగమిస్తూ.. నాతో నేను రమిస్తూ**
**ఒంటరినై ప్రతి నిమిషం.. కంటున్నాను నిరంతరం**
**కిరణాల్ని కిరణాల.. హరిణాల్ని హరిణాల.. చరణాల్ని చరణాల.. చలనాన కనరాని.. గమ్యాల కాలాన్ని ఇంద్రజాలాన్ని ॥జగమంత..॥**

మనం ఒకటి తలిస్తే, విధి మరొకటి రాస్తుంది. మంటల మాటున వెన్నెల, వెన్నెల మాటున మంటలు.. ఎప్పుడు ఏది ఎదురవుతుందో? ఎవరూ చెప్పలేరు. నువ్వు బతికున్నంత కాలం మాత్రమే నువ్వు కోరుకున్నది సాధించుకోగలవు. మరణించిన తర్వాత తోటి మనిషి ప్రేమను పొందాలంటే మనలో దివ్యజ్యోతిని మనమే వెలిగించుకోవాలి. ఎప్పుడు ఆరుతుందో తెలియనిది ఈ జీవనజ్యోతి. ఆ జ్యోతి ఆరక ముందే నలు దిక్కులు జీవనజ్యోతి వెలిగించు అన్న మహోన్నత తత్వాన్ని ఈ చరణం ప్రబోధిస్తుంది.

**చరణం 3:**
**గాలి పల్లకీలోన తరలి నా పాట పాప వూరేగి వెడలె**
**గొంతు వాకిలిని మూసి మరలి తను మూగబోయి నా గుండె మిగిలె**
**నా హృదయమే నా లోగిలి.. నా హృదయమే నా పాటకి తల్లి**
**నా హృదయమే నాకు ఆలి.. నా హృదయములో ఇది సినీవాలి**
**॥జగమంత..॥**

మనిషికి హృదయమే లోగిలి. ఆ హృదయంలో తరిగిపోని ప్రేమానురాగాలు ఉంటాయి. ఎన్నో ఎన్నెన్నో బడబాగ్నులు ఉంటాయి. వాటి నడుమ సాగే ప్రయాణమే ఈ జీవితం. గాలి పల్లకీలో ప్రయాణించే పాట వంటిది. మన గొంతులో ఆ పాట ఎప్పుడు ఆగుతుందో? చెప్పడం కష్టం. అంటే ఈ జీవితం ఎప్పుడు మూగబోతుందో? ఎవ్వరూ ఊహించలేరు. మూగబోయిన నాడు మిగిలేది మన హృదయం పంచిన ప్రేమానురాగాలే.

పాట రాయడానికి సిరివెన్నెలగారు ఎన్ని ప్రసవ వేదనలు అనుభవించారో నాకు తెలీదు. ఆయన గురించి మాట్లాడేంత అర్హత ఉందో? లేదో? కూడా నాకు తెలీదు. శాస్త్రిగారు రాసిన పాటలో భావం చెడకుండా చక్రి అన్నయ్య అద్భుతమైన ట్యూన్ అందించారు. ఈ పాట స్వరపరిచినప్పుడు అన్నయ్య ఎంత తృప్తి పొందారో.. నాకు ఇప్పటికీ గుర్తుంది. తెలుగు సినిమా చరిత్రలో చిరకాలం నిలిచిపోయే పాట ఇది. అన్నయ్య మన మధ్య లేరనే విషయన్ని నా మనసు ఇప్పటికీ అంగీకరించదు. ఈ పాట రూపంలో బతికే ఉంటున్నారని అనుకుంటున్నాను. ఈ పాటతత్వం గురించి చెప్పే అవకాశం రావడం నా పూర్వజన్మ సుకృతం, అదృష్టంగా భావిస్తున్నాను.

ఇంటర్వ్యూ : **సత్య పులగం**

విఘ్నాలను తొలగించే వినాయకుడిని ఆరాధించే ఆచారం అనాదిగా వస్తోంది. లంబోదరుడిగా, హేరంబుడిగా, గజాననుడిగా, ఏకదంతుడిగా, గణాధిపతిగా, మూషికవాహనుడిగా, మోదకప్రియుడిగా వినాయకుడిని పూజిస్తూ ఉంటారు. ఏ పూజలోనైనా, ఏ వ్రతంలోనైనా, క్రతువులోనైనా, యజ్ఞయాగాదికాలలోనైనా తొలిపూజలు అందుకునేది వినాయకుడే! ముక్కోటి దేవతలలో వినాయకుడికి మాత్రమే దక్కే అరుదైన గౌరవం ఇది. బ్రహ్మ పురాణం, బ్రహ్మాండ పురాణం గణపతి గాథలను విపులంగా ప్రస్తావించాయి. ప్రాచీన గ్రంథాలను పరిశీలిస్తే, రుగ్వేదంలో గణపతి గురించిన ప్రస్తావన కనిపిస్తుంది. ఇది క్రీస్తుపూర్వం రెండువేల సంవత్సరాల నాటిదని చరిత్రకారుల అంచనా. మన దేశంలో గుప్తుల కాలం నాటికి... అంటే, క్రీస్తుశకం నాలుగు, ఐదో శతాబ్దాల నాటికి వినాయకుడి ఆరాధన ప్రాచుర్యంలోకి వచ్చింది. క్రీస్తు శకం తొమ్మిదో శతాబ్ది నాటికి ప్రత్యేకంగా గాణపత్య మతమే ఏర్పడింది. షణ్మతాలలో ఒకటిగా పేరుపొందింది. మన దేశంలో శైవ, వైష్ణవ, సౌర, శాక్తేయ, గాణపత్య, కౌమార మతాలు ఉండేవి. గాణపత్య మతస్థులు గణపతిని ప్రత్యేకంగా ఆరాధించేవారు. అయితే ఇతర మతాలలోనూ వినాయకుడిని ఆరాధించే సంప్రదాయం ఉంది. బౌద్ధ, జైన మతస్థులు కూడా గణపతిని ఆరాధించేవారు. గణపతి ఆరాధన మన దేశానికి మాత్రమే పరిమితం కాదు, నేపాల్, భూటాన్, టిబెట్, చైనా, కంబోడియా, జపాన్, ఇండోనేసియా, సింగపూర్ వంటి దేశాలలోనూ ప్రాచీనకాలం నుంచే గణపతి ఆరాధన ఉండేది. పలు దేశాల్లో గణపతి ఆరాధన ఇప్పటికీ కొనసాగుతోంది.

# విశ్వవినాయకుడు

## • విదేశాలలో వినాయకుడు

మన దేశానికి చెందిన వర్తకులు ప్రాచీన కాలంలోనే వివిధ దేశాలతో నౌకా వాణిజ్యం సాగించేవారు. వారి ద్వారా అప్పట్లోనే వినాయకుడు విదేశాలకూ వ్యాపించాడు. క్రీస్తుశకం పదో శతాబ్ది కాలంలో మన వర్తకులు దక్షిణాసియా ప్రాంతంలోని పలు దేశాలతో వర్తక వాణిజ్యాలు సాగించేవారు. జావా, బాలి, బోర్నియో, బర్మా, కంబోడియా, జపాన్, థాయ్‌లాండ్, టిబెట్, చైనా, సింగపూర్ వంటి తూర్పు, ఆగ్నేయాసియా దేశాలలో పురాతన కాలం నాటి గణపతి విగ్రహాలు ఇప్పటికీ దర్శనమిస్తాయి. ఇండోనేసియా కరెన్సీ నోటుపై కూడా గణపతి బొమ్మ కనిపిస్తుంది. మన దేశంపై ముస్లిం దండయాత్రలకు మునుపు అఫ్ఘానిస్థాన్ ప్రాంతంలో సైతం గణపతి ఆరాధన ఉండేది.















## బౌద్ధ, జైనాలలో వినాయకుడు

గణపతి ఆరాధన హిందూమతానికి మాత్రమే పరిమితం కాలేదు. జైన, బౌద్ధమతాలు కూడా తమదైన రీతిలో గణపతిని ఆరాధించుకుంటాయి. జైన మతం కుబేరుడికి చెందిన కొన్ని కీలకమైన విధులను గణపతికి కేటాయించింది. 'అభిదానచింతామణి' అనే జైనగ్రంథంలో వినాయకుడి ప్రస్తావన కనిపిస్తుంది. ఆ గ్రంథం వినాయకుడిని హేరంబుడిగా, గణవిఘ్నేశుడిగా, వినాయకుడిగా ప్రస్తుతించింది. గుప్తుల కాలంలో బౌద్ధులు కూడా వినాయకుడిని ఆరాధించడం మొదలైనట్లు చారిత్రక ఆధారాలు ఉన్నాయి. తాంత్రిక బౌద్ధంలో మహారక్త గణపతిని పూజించేవారు. షడ్భుజాలు గల మహాకాలుడి రూపంలో బౌద్ధ తాంత్రికులు మహారక్త గణపతిని ఆరాధించేవారు. చైనా, జపాన్ ప్రాంతాల్లో బౌద్ధులు క్రీస్తుశకం ఏడు, ఎనిమిది శతాబ్దాల కాలంలోనే వినాయకుడిని ఆరాధించేవారు. ఇక 'గణపతి పురాణం' ప్రకారం బుద్ధుడిని గణపతి అవతారంగానే భావిస్తారు. గణేశ సహస్రనామాల ప్రకారం బుద్ధుడు సాక్షాత్తు గణపతి అవతారమేనని పదిహేడో శతాబ్దికి చెందిన పండితుడు భాస్కరరాయలు అభిప్రాయపడ్డారు. థాయ్‌లాండ్, కంబోడియా వంటి దేశాలలో వినాయకుడిని విజయానికి, అదృష్టానికి కారకుడిగా ఆరాధిస్తారు. వినాయకుడు బుద్ధిబలాన్ని అనుగ్రహించడమే కాకుండా, అదృష్టాన్ని కలిగిస్తాడని పలు దేశాలలో నమ్ముతారు.



## వినాయకుడు..వాహనాలు

అత్యంత పురాతన కాలంలో వినాయకుడి విగ్రహాలు ఎలాంటి వాహనం లేకుండానే కనిపించేవి. వినాయకుడు మూషిక వాహనుడిగా ప్రసిద్ధి పొందినా, పలు ప్రాచీన విగ్రహాలలో వినాయకుడు వేర్వేరు వాహనాలపై కనిపిస్తాడు. వినాయకుడికి ఎనిమిది అవతారాలు ఉన్నట్లు 'ముద్గల పురాణం' వివరిస్తుంది. వాటిలోని ఐదు అవతారాలలో వినాయకుడు మూషికాన్నే వాహనంగా చేసుకున్నట్లు ఉంది. అయితే, మహోత్కటావతారంలో సింహాన్ని, మయూరేశ్వరావతారంలో నెమలిని, ధూమకేతు అవతారంలో అశ్వాన్ని వాహనంగా ఉపయోగించినట్లు 'ముద్గల పురాణం' చెబుతోంది. గణపతిని విఘ్నేశ్వరుడిగా పురాణాలు ప్రస్తుతించాయి. వినాయకుడు ఐహిక, ఆముష్మిక విఘ్నాలన్నింటినీ దూరం చేస్తాడని ప్రతీతి. విద్యలకు కూడా అధిపతి అయిన వినాయకుడు బుద్ధిని అనుగ్రహిస్తాడని ప్రతీతి.



## సాల్వ్ చేస్తారా? శీర్షాసనమేస్తారా?

### మాయా బజార్

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | | | | 2 | |
| | | | 3 | | 4 | |
| | | 5 | | 6 | | |
| | 7 | | | | | |
| | | | | 8 | 9 | 10 |
| 11 | | | | | | |
| | | | 12 | | | 13 |

**అడ్డం:**

1. సురేందర్‌రెడ్డి దర్శకత్వంలో రవితేజ హిట్ సినిమా (2)
4. యోగానంద్ దర్శకత్వంలో ఎన్టీఆర్, మంజుల నటించిన సినిమాలో చివరి రెండక్షరాలు (2)
5. తమిళ్, తెలుగు, కన్నడ, మలయాళం చిత్రాల్లో నటించిన నటి. 'దృశ్యం' సినిమాకు డెరెక్టర్ (3)
7. 'మహా మహా' సాంగ్ ఉన్న చార్మీ హారర్ సినిమా అటునుంచి. ఈ సినిమాకు తులసీరామ్ డైరెక్టర్ (2)
8. రాజ్–కోటి మ్యూజిక్ చేసిన రాజశేఖర్ సినిమా అటు నుంచి. కె.మధు ఈ సినిమాకు డైరెక్టర్. ఈ చిత్రానికి రాజశేఖర్ బెస్ట్‌యాక్టర్‌గా ఫిల్మ్‌ఫేర్ అవార్డ్ అందుకున్నాడు. (3)
11. 'మనల్ని చంపాలనుకునేవాడిని చంపడం యుద్ధం. మనల్ని కావాలనుకునేవాడిని చంపడం నేరం. మనల్ని మోసం చేయాలనుకునేవాడిని చంపడం న్యాయం' డైలాగు ఈ సినిమాలోనిదే (3)
12. ప్రముఖ నటుడి కుమారుడు. ప్రముఖ హీరో తమ్ముడు. 'ఊపిరి' సినిమాతో తెలుగు ప్రేక్షకులకు మరింత చేరువయ్యాడు (2)

**నిలువు:**

1. 'ప్రియా ప్రియతమా' పాట ఉన్న నాగార్జున సినిమా. నగ్మ హీరోయిన్ . ఈ సినిమాకు ఫజిల్ దర్శకత్వం చేశారు(3)
2. రవితేజ, భీమాసేన్, ఆర్తి అగర్వాల్ నటించిన సినిమా కింది నుంచి. తమిళ సినిమా 'దూళ్'కు ఇది రిమేక్ (2)
3. యస్పీ చిట్టిబాబు దర్శకత్వంలో చిరంజీవి, రాధిక జంటగా నటించిన సినిమా కింది నుంచి. ఈ సినిమాకు చక్రవర్తి సంగీతం సమకూర్చారు (2)
5. మహేష్‌బాబు హిట్ సినిమా (4)
6. సూర్య తమిళ్ యాక్షన్ మసాల ఫిల్మ్...ఈ పేరుతో తెలుగులో డబ్ అయింది. హరి దర్శకత్వం చేసిన ఈ చిత్రానికి దేవిశ్రీ ప్రసాద్ సంగీతం సమకూర్చాడు. (3)
9. 'నైజాం పోరీ' 'నిగ్గదీసి అడుగు' 'స్వరాజ్యం ఎందుకని' పాటలున్న రామ్‌గోపాల్‌వర్మ సినిమా. పోసాని కృష్ణమురళీ డైలాగులు రాశారు (2)
10. నాగార్జున నవ్వుల సినిమా పైకి వెళ్లింది (4)
11. కె.రాఘవేంద్రరావు దర్శకత్వంలో నాగార్జున, శాంతిప్రియ జంటగా నటించిన సినిమా (2)
13. 'సింధూరం' 'అనగనగా ఒక రోజు', 'గాయం' సినిమాల సంగీత దర్శకుడు. (1)

### మైథోగ్రఫీ

1. మత్స్యగంధి తండ్రి

◇◇◇◇

2. పై జవాబులో '3'వ అక్షరంతో...ఇంద్రుడు కురిపించిన వాన.

◇◇◇◇

3. రావణుని కొడుకు. పై జవాబులో '4'వ అక్షరంతో...

◇◇◇◇◇

4. ఒక రాక్షస రాజు. పై జవాబులో మొదటి అక్షరంతో...

◇◇◇◇

5. మేరుపర్వతం పేరు. పై జవాబులో '2'వ అక్షరంతో...

◇◇◇◇◇

### బ్రెయిన్ జిమ్

1. ఈ లెటర్‌లో సముద్రం ఉంటుంది. అదేమిటి?
2. రింగ్ ఉంది కానీ ఫింగర్ లేదు. నేనెవరిని?
3. ఒకటిని వెళ్లిపోయేలా చేయండి.
4. మామ కాని మామ

| | | | | |
|---|---|---|---|---|
| టె | లి | ఫో | న్ | C |
| వ | శ | అ | K | G |
| R | A | G | అ | శ్రీ |
| G | O | N | E | వి |
| చం | ద | మా | మ | జ |

### జవాబులు

**బ్రెయిన్ జిమ్**

| | | | | |
|---|---|---|---|---|
| టె | లి | ఫో | న్ | C |
| వ | శ | అ | K | G |
| R | A | G | అ | శ్రీ |
| G | O | N | E | వి |
| చం | ద | మా | మ | జ |

**మైథోగ్రఫీ**

1.దాశరాజు 2. రాళ్లవాన 3. నరాంతకుడు 4. నరకుడు 5. రత్నసానువు

**మాయా బజార్**

అడ్డం: 1. కిక్ 4. వాడే వీడు 5. శ్రీప్రియ 7. మంత్ర 8. మగాడు 10.అతడు 11.కార్తీ

నిలువు: 1. కిల్లర్ 2. వీడే 3. ప్రియ 6. యముడు 9. గాయం 10. అగ్ని 12. శ్రీ

### కిసుక్కు

అప్పారావు: బ్రెయిన్ అనేది బెర్ముడా ట్రయాంగిలా?

సుబ్బారావు: అవును...అందులోకి ఇన్‌ఫర్‌మేషన్ పోతుంది తప్ప కనిపించదు!

### మీకు తెలుసా

పదకొండవ శతాబ్దం తొలినాళ్లలో జపాన్ రచయిత్రి మురసాకి షికిబు రాసిన 'ది టేల్ ఆఫ్ జెంజి' ఫస్ట్ 'మోడ్రన్ నావెల్' సైకాలజికల్ నావెల్‌గా పేరుగాంచింది.

## పదశోధన - 405

నిర్వహణ : అదృష్టదీపక్

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | | | 3 | 4 | | 5 | 6 |
| 7 | | | | 8 | | | | 9 | |
| | | 10 | 11 | | | 12 | | | |
| | 13 | | | 14 | | | | | |
| 15 | | | | 16 | | | 17 | | 18 |
| 19 | | | 20 | | | 21 | | 22 | |
| 23 | | | 24 | | | | 25 | | |
| | | 26 | | | | | | | 27 |
| 28 | | | | | | 29 | | 30 | |
| | | | | | 31 | | | | |

**ఆధారాలు**

**అడ్డం**

1. విక్రమార్కునికి కథలు చెప్పినవాడు (4)
3. పాడైన కంఠస్వరం (5)
7. సుఖం (2)
8. మచిలీపట్నం (3)
9. నీటిమీద తేలే కొయ్యదుంగ (2)
10. పైరులోని కసవు, గడ్డి (2)
12. తూర్పునకు ఎదుటి దిక్కు (4)
13. కొమ్ము విరిగితే జరిగే అవమానం (4)
15. పెద్ద ఢంకా (3)
16. దగ్గ రూపాంతరం (2)
17. ప్రేమ, చెలిమి (3)
19. మల్లె, బట్టలు మొదలగువాటిని కలిపి కట్టినది (2)
20. సొరుగు, సగం (2)
22. మోపు, చెరువు గట్టు (2)
23. స్వర్గం (2)
24. ఆగంతకునికి స్త్రీ వాచకం (6)
28. భాగవతంలో గాడిద కాళ్లు పట్టుకున్నవాడు (5)
30. ఆజ్ఞ (2)
31. కొయ్య బొమ్మ (5)

**నిలువు**

1. వ్యాపారి (3)
2. తాయిలం తెచ్చిన తల్లి (2)
3. రంధ్రం, తల నరకిన అరటిచెట్టు (2)
4. విద్య నేర్పినవాని భార్య (4)
5. అసాధ్యమైన కోరికలు (7)
6. రూపం మారిన తుంపర (3)
10. పావడ (3)
11. కపటం, తప్పు (2)
13. శృంగార నాటకంలో నాలుగు దారులు కలిసే చోటు (4)
14. గండ ద్వయంతో శూరాధి శూరుడు (6)
15. మాదిరి, మచ్చు (3)
18. ఎత్తుగా ఉన్న భూమి, చిన్న కొండ (2)
20. తొలి అచ్చులు (2)
21. కటారి, చిన్న కత్తి (2)
25. రాజు పరిపాలించేది (2)
26. సంశయం (3)
27. భరతమాత (3)
28. వరి ధాన్యం (2)
29. శిరస్సు (2)
30. యుద్ధం (2)

### పదశోధన - 404 జవాబు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 క | 2 ర | త | లా | 3 మ | 4 ల | 5 కం | | 6 బా | కీ |
| 7 న | గ | | | 8 క | చ్చి | క | | వ | |
| 9 కం | డ | 10 కా | 11 వ | రం | | 12 ణం | బా | మ | 13 రా |
| | | 14 క | డ్డీ | | 15 అ | | | 16 ర | వి |
| 17 అ | జం | తా | | 18 ఆ | ట | వె | 19 ల | ది | |
| త్తె | | ళీ | | 20 ది | వి | | క్ష | | 21 శ |
| 22 స | మ | యం | | ప | | 23 గు | ణ | 24 కా | రం |
| రు | | | 25 స | ర్వం | 26 స | హ | | మ | |
| | 27 గీ | | గ | | ర | | 28 కు | రూ | 29 పి |
| 30 ఎం | త | ఘా | టు | ప్రే | మ | యో | | 31 పం | కం |

## • టేస్ట్ టెస్ట్

**అడ్డం:**

1. ఆంధ్రుల అభిమాన ఊరగాయ. మామిడికాయల సీజన్‌లో చాలా ఇళ్లల్లో దీని తయారీనే హడావుడి.
2. ఆబ్దీకం భోజనాల్లో తప్పనిసరి వంటకం. అందుకే... దీనిపొట్టు దొరికినప్పుడే తద్దినం పెట్టాలంటారు.
4. చేదుకాయతో తయారు చేసే వేపుడు. ముక్కలు పలచగా తరిగి వేయిస్తే కరకరలాడుతుంది.

**నిలువు:**

1. గుమ్మడిపండుకు చెల్లెల్లాంటి ఈ కాయతో తయారు చేసే పులుసు.
3. పాములాంటి పొడవాటి కాయతో శుభ్రంగా నూరుకునే రోటి పచ్చడి.
5. బొంబాయిరవ్వ ఉంటే చాలు.. సునాయాసంగా తయారుచేసుకోగల మిఠాయి.
6. పుస్తెలమ్ముకుని అయినా ఈ కూర తినాలని సామెత. గోదావరి జిల్లాల్లో భలే ఫేమస్.

**జవాబు**

అడ్డం: 1. ఆవకాయ, 2. పనసపొట్టు కూర, 4. కాకర వేపుడు
నిలువు: 1. ఆనపకాయ పులుసు, 3. పొట్లకాయ పచ్చడి, 5. రవ్వకేసరి, 6. పులస కూర

## సుడోకు - 165

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | 7 | 3 | 1 | | 2 | 6 |
| 2 | 6 | | 8 | | | | | 4 |
| | 1 | | | | | 9 | 5 | 7 |
| 4 | | 5 | 3 | | | | | |
| | 7 | | | | | | 6 | |
| | | | | | 9 | 7 | | 3 |
| 5 | 4 | 8 | | | | | 7 | |
| 1 | | | | | 6 | | 9 | 8 |
| 7 | 9 | | 4 | 8 | 2 | | | |

కఠిన స్థాయి

1 2 3 4 5

### సుడోకు 164 జవాబు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 4 | 1 | 2 | 7 | 5 | 9 | 8 | 6 | 3 |
| 8 | 7 | 3 | 2 | 6 | 4 | 1 | 5 | 9 |
| 6 | 5 | 9 | 3 | 8 | 1 | 7 | 4 | 2 |
| 2 | 6 | 1 | 9 | 7 | 5 | 3 | 8 | 4 |
| 9 | 8 | 4 | 6 | 1 | 3 | 5 | 2 | 7 |
| 7 | 3 | 5 | 4 | 2 | 8 | 6 | 9 | 1 |
| 1 | 2 | 7 | 8 | 4 | 6 | 9 | 3 | 5 |
| 3 | 4 | 6 | 5 | 9 | 7 | 2 | 1 | 8 |
| 5 | 9 | 8 | 1 | 3 | 2 | 4 | 7 | 6 |

# 4 సెప్టెంబర్ నుంచి 10 సెప్టెంబర్, 2016 వరకు

సింహంభట్ల సుబ్బారావు
జ్యోతిష్య పండితులు





**మేషం:** (అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)
కొత్త విషయాలు తెలుసుకుంటారు. ప్రతిభాపాటవాలు వెలుగులోకి వస్తాయి. ఆశయాలు నెరవేరతాయి. కొత్త కార్యక్రమాలకు శ్రీకారం చుడతారు. ఆలోచనలు కలిసివస్తాయి. ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. వ్యాపారాలు పుంజుకుంటాయి. ఉద్యోగులకు హోదాలు పెరుగుతాయి. కళాకారులకు కార్యసిద్ధి. ఎరుపు, నేరేడు రంగులు, తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. శివపంచాక్షరి పఠించండి.



**వృషభం:** (కృత్తిక 2,3,4 పా., రోహిణి, మృగశిర 1,2 పా.)
చేపట్టిన కార్యక్రమాలు కొంత ఆలస్యంగా పూర్తి కాగలవు. ఆర్థిక విషయాలు సంతృప్తికరంగా ఉంటాయి. కొన్ని ఇబ్బందులు తొలగి ఊరట చెందుతారు. బంధువులు, మిత్రులను కలుసుకుంటారు. ఆరోగ్యపరంగా చికాకులు. వ్యాపారాలు క్రమేపీ లాభిస్తాయి. ఉద్యోగులకు ఒత్తిడులు కాస్త చికాకు పరుస్తాయి. పారిశ్రామికవర్గాలకు ఆశాజనకంగా ఉంటుంది. ఆకుపచ్చ, గులాబీ రంగులు, దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. విష్ణుధ్యానం చేయండి.



**మిథునం:** (మృగశిర 3,4, ఆరుద్ర, పునర్వసు 1,2,3 పా.)
మొదట్లో కొద్దిపాటి చికాకులు, సమస్యలు ఎదుర్కొంటారు. క్రమేపీ కొంత అనుకూలిస్తుంది. అనుకున్న ఆదాయం సమకూరుతుంది. వ్యవహారాలలో విజయం. ఆప్తుల నుంచి ఆహ్వానాలు రాగలవు. గత సంఘటనలు గుర్తుకు రాగలవు. ఆస్తి వివాదాలు తీరతాయి. వ్యాపారాలు లాభిస్తాయి. ఉద్యోగులకు ఇంక్రిమెంట్లు రాగలవు. రాజకీయవర్గాలకు ఉత్సాహవంతంగా ఉంటుంది. లేత ఎరుపు, చాక్లెట్ రంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. వేంకటేశ్వరస్వామి స్తోత్రాలు పఠించండి.



**కర్కాటకం:** (పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)
ఆర్థిక పరిస్థితి కొంత ఇబ్బంది కలిగించినా అవసరాలు తీరతాయి. వ్యవహారాలు నిదానంగా పూర్తి కాగలవు. ఆలోచనలు కార్యరూపం దాలుస్తాయి. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. పలుకుబడి పెరుగుతుంది. వాహన, గృహయోగాలు కలుగుతాయి. కొన్ని ముఖ్య నిర్ణయాలు తీసుకుంటారు. విద్యార్థులకు కొత్త ఆశలు. వ్యాపారాలు లాభిస్తాయి. ఉద్యోగులకు ఇంక్రిమెంట్లు దక్కవచ్చు. రాజకీయవర్గాలకు పదవులు ఊరిస్తాయి. తెలుపు, పసుపు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. గణేశ్‌స్తోత్రాలు పఠించండి.



**సింహం:** (మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)
ఆర్థిక ఇబ్బందులు ఎదురై రుణాలు చేస్తారు. పనులు కొన్ని పెండింగ్‌లో పడతాయి. ఆలోచనలు స్థిరంగా ఉండవు. బంధువులతో మాటపట్టింపులు. ఆలయాలు సందర్శిస్తారు. ఆరోగ్య విషయంలో కొద్దిపాటి చికాకులు. ఎంత కష్టించినా ఫలితం కనిపించదు. ఆస్తి వివాదాలు నెలకొంటాయి. వ్యాపారాలు మందకొడిగా సాగుతాయి. ఉద్యోగులకు పనిభారం. పారిశ్రామికవర్గాలకు ఒత్తిడులు. ఎరుపు, చాక్లెట్ రంగులు, తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. ఆదిత్య హృదయం పఠించండి.



**కన్య:** (ఉత్తర 2,3,4 పా., హస్త, చిత్త1,2 పా.)
కొత్త కార్యక్రమాలు చేపడతారు. ఆర్థిక పరిస్థితి మెరుగ్గా ఉంటుంది. సన్నిహితుల సాయం అందుతుంది. నిరుద్యోగులకు హోదాలు దక్కుతాయి. ప్రముఖులతో పరిచయాలు. సంఘంలో గౌరవమర్యాదలు పొందుతారు. భూములు, వాహనాలు కొంటారు. వ్యాపారాలు విస్తరిస్తారు. ఉద్యోగులకు ఉన్నతస్థితి. కళాకారులకు సన్మానాలు. తెలుపు, నేరేడు రంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. లక్ష్మీ స్తోత్రాలు పఠించండి.



**తుల:** (చిత్త 3,4, స్వాతి, విశాఖ1,2,3 పా.)
పనులు చకచకా పూర్తి చేస్తారు. ఆత్మీయులు, బంధువులతో సఖ్యత నెలకొంటుంది. పలుకుబడి కలిగిన వ్యక్తులు నుంచి ఆహ్వానాలందుతాయి. ఉద్యోగయత్నాలు కలిసివస్తాయి. పాతబాకీలు వసూలవుతాయి. ఇంటి నిర్మాణాలలో ఆటంకాలు తొలగుతాయి. వ్యాపారాలు లాభిస్తాయి. ఉద్యోగులకు కొత్త బాధ్యతలు. రాజకీయవర్గాలకు కొత్త పదవులు లభిస్తాయి. నీలం, లేత పసుపు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. గణేశ్‌ను పూజించండి.

**వృశ్చికం:** (విశాఖ 4 పా., అనూరాధ, జ్యేష్ఠ)
దూరపు బంధువులను కలుసుకుంటారు. పలుకుబడి పెరుగుతుంది. ఆత్మీయుల నుంచి కీలక సమాచారం అందుతుంది. శుభకార్యాలకు డబ్బు వెచ్చిస్తారు. రాబడి ఆశాజనకం. కొన్ని సమస్యలు తీరి ఊపిరిపీల్చు కుంటారు. ప్రతిభ వెలుగులోకి వస్తుంది. వ్యాపారాలలో అనుకూలస్థితి. ఉద్యోగు లకు పదోన్నతులు. రాజకీయవర్గాలకు పదవులు దక్కవచ్చు. ఎరుపు, చాక్లెట్ రంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. విష్ణుసహస్రనామ పారాయణ చేయండి.

**ధనుస్సు:** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)
రుణభారాలు తగ్గుతాయి. రావలసిన సొమ్ము అందుతుంది. వ్యవహారాలలో ఆటంకాలు తొలగుతాయి. ప్రముఖుల నుంచి ఆహ్వానాలు సంతోషం కలిగిస్తాయి. ఇంతకాలం పడిన శ్రమ ఫలిస్తుంది. జీవిత భాగస్వామి సలహాలు స్వీకరిస్తారు. ఆస్తి వివాదాలు తీరతాయి. వ్యాపారాలు లాభసాటిగా ఉంటాయి. ఉద్యోగులకు ఉన్నత హోదాలు. కళాకారులకు సన్మానాలు. గులాబీ, లేత పసుపు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. దుర్గామాతకు అర్చన చేయండి.

**మకరం:** (ఉత్తరాషాఢ 2,3,4, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)
అనుకున్న ఆదాయం సమకూరుతుంది. సన్నిహితులతో ఆనందంగా గడుపుతారు. సేవాకార్యక్రమాలలో పాల్గొంటారు. పనులు సకాలంలో పూర్తి చేస్తారు. బంధువర్గం నుంచి ముఖ్య సమాచారం అందుతుంది. స్థిరాస్తి వివాదాలు తీరి లబ్ధి పొందుతారు. వ్యాపారాలలో లాభాలు తథ్యం. ఉద్యోగులకు పనిభారం తగ్గవచ్చు. పారిశ్రామికవర్గాలకు విదేశీ పర్యటనలు. నలుపు, లేత ఆకుపచ్చ రంగులు, దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. నవగ్రహస్తోత్రాలు పఠించండి.

**కుంభం:** (ధనిష్ఠ 3,4, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా.)
ప్రారంభంలో కొన్ని చికాకులు తప్పకపోవచ్చు. ఆర్థిక విషయాలు సంతృప్తినిస్తాయి. ఉద్యోగయత్నాలు అనుకూలిస్తాయి. ఇంటాబయటా మీకు ఎదురుండదు. పనులు కొంత జాప్యం జరిగినా పూర్తి కాగలవు. ఆస్తి వివాదాలు తీరతాయి. దూరప్రాంతాల నుంచి శుభవార్తలు. వాహనయోగం. వ్యాపారాల్లో కొత్త పెట్టుబడులు అందుతాయి. ఉద్యోగులకు ఒత్తిడులు తొలగుతాయి. రాజకీయవర్గాలకు అనుకున్న పదవులు దక్కవచ్చు. ఆకుపచ్చ, నలుపు రంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. ఆంజనేయ దండకం పఠించండి.

**మీనం:** (పూర్వాభాద్ర 4 పా., ఉత్తరాభాద్ర, రేవతి)
అనుకున్న పనులు నెమ్మదిగా సాగుతాయి. ఆర్థిక పరిస్థితి గతం కంటే మెరుగ్గా ఉంటుంది. బంధువులతో తగాదాలు తీరతాయి. ఆరోగ్యం మాత్రం కొంత చికాకు పరుస్తుంది. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. కొన్ని ముఖ్య నిర్ణయాలు తీసుకుంటారు. విద్యార్థులకు కొత్త ఆశలు. శుభకార్యాలలో పాల్గొంటారు. వ్యాపారాలు క్రమేపీ లాభిస్తాయి. ఉద్యోగులకు ఇంక్రిమెంట్లు. రాజకీయవర్గాలకు సంతోషకరమైన సమాచారం. గులాబీ, తెలుపు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. విష్ణుసహస్రనామ పారాయణ చేయండి.

● టారో

4 సెప్టెంబర్ నుండి
10 సెప్టెంబర్, 2016
వరకు












ఇన్సియా
టారో అనలిస్ట్

**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 19)**

జీవిత భాగస్వామితో సామరస్యంగా మెలగడం మంచిది. అనవసరమైన ఆందోళనలకు గురవుతారు. వాదోపవాదలలో తలదూర్చకుండా ఉంటేనే క్షేమం. త్వరలోనే ఆశ్చర్యకరమైన శుభవార్త వింటారు. జీవితంలో ఒక మెట్టు పైకి ఎదుగుతారు. ప్రేమికుల మధ్య పొరపొచ్చాలు, విడిపోయే పరిస్థితులు తప్పకపోవచ్చు. ఆర్థిక ఫలితాలు బాగుంటాయి.

**లక్కీ కలర్: గోధుమరంగు**

**వృషభం (ఏప్రిల్ 20 - మే 20)**

సాహసోపేతమైన కార్యక్రమాలను చేపడతారు. కొత్త భాగస్వాములతో కలసి కొత్త వ్యాపారాలకు నాంది పలుకుతారు. నూతన భాగస్వామ్యంతో వ్యాపారాలు లాభాల బాటలో పరుగులు తీస్తాయి. పొదుపు చేయడానికి అనుకూలమైన కాలం. స్పెక్యులేషన్‌కు దూరంగా ఉండటం మంచిది. పార్టీలకు దూరంగా ఉండటం, ఆహారంపై శ్రద్ధ వహించడం క్షేమం.

**లక్కీ కలర్: ఆకుపచ్చ**

**మిథునం (మే 21 - జూన్ 20)**

గత కర్మల ఫలితాలు అనుభవంలోకి వస్తాయి. కోర్టు తీర్పులు, అధికారుల నిర్ణయాలకు అనుకూలంగా వస్తాయి. జీవితంలో ఒక కీలక నిర్ణయం తీసుకోవాల్సి వస్తుంది. విజయపథంలో మరిన్ని ఉన్నత శిఖరాలను చేరుకోవాలంటే రిస్కు తీసుకోక తప్పదని గ్రహిస్తారు. ఆరోగ్య విషయంలో ఇబ్బందులు తలెత్తే సూచనలు ఉన్నాయి. జీవిత భాగస్వామితో సంతోషంగా గడుపుతారు.

**లక్కీ కలర్: పసుపు**

**కర్కాటకం (జూన్ 21 - జూలై 22)**

అలుపెరుగకుండా కఠోరంగా పరిశ్రమించినందుకు మిమ్మల్ని మీరే అభినందించుకుంటారు. ఖరీదైన వస్తువులను కొనుగోలు చేస్తారు. జీవితంలో సమాధానం దొరకని చాలా ప్రశ్నలకు సమాధానాలను అన్వేషిస్తారు. ధైర్యంగా మీ పనిని మీరు కొనసాగిస్తారు. కొన్ని చిన్న చిన్న విషయాల్లో జీవిత భాగస్వామితో భేదాభిప్రాయాలు తలెత్తవచ్చు. సామాజిక కార్యక్రమాల్లో పాల్గొంటారు.

**లక్కీ కలర్: బంగారురంగు**

**సింహం (జూలై 23 - ఆగస్ట్ 22)**

ఆర్థికంగా అన్ని విధాలా కలిసొచ్చే కాలం ఇది. మీ పురోగతి ఇతరులకు అసూయ కలిగిస్తుంది. ఇదివరకే చేపట్టిన పనులకు సంబంధించిన ఫలితాల కోసం చెక్కుచెదరని ఆత్మవిశ్వాసంతో నిరీక్షిస్తారు. తల్లిదండ్రుల పట్ల శ్రద్ధ చూపాల్సి వస్తుంది. పని ఒత్తిడికి దూరంగా విహారయాత్రలకు వెళతారు. ముఖ్యమైన వ్యక్తులతో సంబంధాలు బలపడతాయి.

**లక్కీ కలర్: ఆకుపచ్చ**

**కన్య (ఆగస్ట్ 23 - సెప్టెంబర్ 22)**

ఇప్పటి వరకు శ్రమించిన కొనసాగిస్తున్న పని మీద ఆసక్తి కోల్పోతారు. నిర్లిప్తతకు లోనవకుండా, పరిస్థితిని అదుపులోకి తెచ్చుకోవడం మంచిది. ప్రేమానుబంధాల పట్ల ఓపికగా వ్యవహరిస్తూ వస్తున్న మీరు, ఇప్పుడొక స్పష్టతకు రావాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. ఆరోగ్యంపై శ్రద్ధ తీసుకోవాల్సి వస్తుంది. ఆర్థిక పరిస్థితులను ఆచి తూచి అదుపు చేయాల్సి ఉంటుంది.

**లక్కీ కలర్: నాచు రంగు**

**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 22)**

సృజనాత్మక ఆలోచనలతో ముందంజ వేస్తారు. ఇతరుల పట్ల మీ దృక్పథాన్ని మార్చుకోవడం ద్వారా చిరకాల లక్ష్యాలను చేరుకోగలుగుతారు. ప్రస్తుత ఒడిదుడుకులన్నీ ఒక దశ మాత్రమే. నెమ్మదిగా పరిస్థితి చక్కబడి, భవిష్యత్తు ఉజ్వలంగా వెలుగొందుతుంది. అలాగని రాత్రికి రాత్రే ధనవంతులైపోతామనే భ్రమలు పెట్టుకోకండి. చేపట్టిన పనులను శ్రద్ధగా పూర్తి చేయండి. ఫలితాలు వాటంతట అవే వస్తాయి.

**లక్కీ కలర్: నేరేడు రంగు**

**వృశ్చికం (అక్టోబర్ 23 - నవంబర్ 21)**

అభద్రతాభావంతో ఆందోళన చెంది కుంగిపోతారు. భద్రతగా అనిపించని చోట్ల పెట్టుబడులు పెట్టకుండా ఉండటమే క్షేమం. వృత్తి, ఉద్యోగాల్లోను, వ్యాపారాల్లోను మార్పులు అనివార్యం అవుతాయి. విద్యార్థులు కొత్త కోర్సులను ఎంపిక చేసుకునే అవకాశాలు ఉన్నాయి. ఆడుతూ పాడుతూ ఉంటేనే అలసట లేకుండా పనులు పూర్తిచేయగలమని తెలుసుకుంటారు. విచిత్రమైన అనుభవాలు ఎదురవుతాయి.

**లక్కీ కలర్: బంగారు రంగు**

**ధనుస్సు (నవంబర్ 22 - డిసెంబర్ 21)**

ఆత్మగౌరవాన్ని కాపాడుకుంటారు. ఆత్మవిశ్వాసంతో కార్యసాధనలో సఫలీకృతులవుతారు. వృత్తి ఉద్యోగాల్లో మీ ప్రతిభా పాటవాలు వెలుగులోకి వస్తాయి. బంధువుల కారణంగా అనవసర భారం నెత్తిన పడే అవకాశాలు ఉన్నాయి. వివాదాలను పరిష్కరించుకుంటారు. ఇబ్బందికరమైన పరిస్థితులు ఎదురవుతాయి. విదేశాలకు వెళ్లే అవకాశాలున్నాయి.

**లక్కీ కలర్: ఊదా**

**మకరం (డిసెంబర్ 22 - జనవరి 19)**

ఆర్థికపరంగా అద్భుతంగా కలిసొస్తుంది. పని ప్రదేశంలో పునర్నిర్మాణాలు జరిగే అవకాశాలు ఉన్నాయి. కుటుంబంలోని ఒక మహిళ కారణంగా అదృష్టం కలిసొస్తుంది. గతంలోని చేదు అనుభవాలను మరచిపొండి. భవిష్యత్తు ఉజ్వలంగా ఉంటుంది. విజయపథంలో దూసుకుపోతారు. సన్నిహితులతో విహారయాత్రలకు వెళతారు.

**లక్కీ కలర్: పసుపు**

**కుంభం (జనవరి 20 - ఫిబ్రవరి 18)**

చిరకాల స్వప్నాలు నెరవేరుతాయి. ఆస్తిపాస్తులు, సంపద మీకెన్నడూ సమస్య కానే కాదు. ప్రతి రోజునూ కొత్తగా మొదలుపెడతారు. విందు వినోదాల్లో, వేడుకల్లో ఉత్సాహంగా పాల్గొంటారు. చాలాకాలం తర్వాత పాత మిత్రులను కలుసుకుంటారు. పని ఒత్తిడి పెరిగి దాని ప్రభావం ఆరోగ్యం మీద పడే అవకాశాలు లేకపోలేదు. గతానుభవాల నేపథ్యంలో ఆత్మవిమర్శ చేసుకుంటారు.

**లక్కీ కలర్: నేరేడు రంగు**

**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20)**

పరస్పర విరుద్ధమైన అంశాలలో ఏదో ఒకటి ఎంచుకోవాల్సిన అనివార్యత ఏర్పడుతుంది. ఇంటా బయటా తీరిక దొరకడం దుర్లభంగా ఉంటుంది. వృత్తిపరమైన నైపుణ్యాలతో అనితరసాధ్యమైన వ్యాపార విజయాలను సాధిస్తారు. వృత్తి ఉద్యోగాల్లో ఎదురయ్యే పోటీలో ముందంజలో ఉంటారు. ప్రేమికుల మధ్య పొరపొచ్చాలు తలెత్తవచ్చు. సామరస్యంగా పరిష్కరించుకోవాల్సి ఉంటుంది.

**లక్కీ కలర్: గులాబి**

